

# బాల భారతి

సేకరణ 'బాల' నుండి

సంకలనం

వెలగా వెంకటప్పయ్య



# బాల భారతి

[శ్రీ న్యాయపతి రాఘవరావు "అన్నయ్య" శ్రీమతి న్యాయపతి కామేశ్వరి "అక్కయ్య" గార్ల ఆధ్వర్యంలో, 1945 నుండి 1961 వరకు వెలువడి, తెలుగు బాలలలో నవ చైతన్యం మోసులెత్తించిన 'బాల' మాస పత్రికలోని మేలిరచనల వెలుగు హరివిల్లు.]

సంకలనం :

వెలగా వెంకటప్పయ్య

ప్రచురణ :




రిజిష్టరు నెం. 1/64

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు-3

BALA BHARATHI
SELECTIONS FROM THE POPULAR CHILDRENS' MONTHLY 'BALA' UNDER THE EDITORSHIP OF SRI NYAYAPATHI RAGHAVARAO 'ANNAYYA' AND SRIMATHI NYAYAPATHI KAMESWARI 'AKKAYYA'
COLLECTED BY: VELAGA VENKATAPPAIAH



యువభారతి

ప్రచురణ : 56
ప్రథమ ముద్రణ :
10 ఫిబ్రవరి 1977
ప్రతులు : 5,200
ద్వితీయ ముద్రణ :
10 మే 1980
ప్రతులు : 1,200
*ముఖచిత్ర రచన :*
శ్రీ శీలా వీర్రాజు
*ముద్రణ :*
నాగార్జున ఆర్ట్ ప్రింటర్స్, హైద్రాబాదు.
*ముఖచిత్ర ముద్రణ :*
టెక్నో ప్రింటర్స్, హైద్రాబాదు.
*ప్రతులకు :*
**యువభారతి**
5. కింగ్స్‌వే, సికిందరాబాద్ -500 003
లేదా
**యువభారతి కార్యాలయం**
ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు
తిలక్‌రోడ్, హైదరాబాద్ - 500 001
**వెల : రూ. 2-00**

ఆంధ్రప్రదేశ్ బాలల మహాసభలు 1977 సందర్భంగా, ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ, హైదరాబాదు వారి ప్రోత్సాహముతో ప్రచురితము.

**మండలి వెంకట కృష్ణారావు**
విద్యా, సాంస్కృతిక శాఖామాత్యులు
ఆంధ్రప్రదేశ్ రాష్ట్రప్రభుత్వము
అ ధ్య క్షు లు :
ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ.




## బాల భారతి - భావిభారతి

నేటి బాలలే రేపటి పౌరులు. దేశభవిష్యత్తు వారిమీద ఆధారపడివుంది. పిన్నలను తీర్చిదిద్దడం పెద్దల కర్తవ్యం. చిన్నప్పుడే బాలలు తమ వ్యక్తిత్వాలను రూపొందించుకునే వాతావరణాన్ని, ప్రోత్సాహాన్ని సమాజం కల్పించాలి. బాలల్లో ఉన్న కళలూ తెలివితేటలూ నిర్మాణాత్మకంగా దేశానికి ఉపయోగపడేటట్లు అవకాశాలు రూపొందించాలి. అన్నిరంగాల్లోవలెనే, బాలలలోని సృజనాత్మకశక్తినీ, కళాతృష్ణనూ, ప్రతిభావికాసాలనూ పరిపోషించటానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ముందంజవేసింది. రాష్ట్రంలో బాలల సాహిత్య సాంస్కృతిక కళావికాసాలకు కృషిచేసే సంస్థలూ, పత్రికలూ ఉన్నాయి. ఆ రంగాలలో వ్యష్టిగా జరుగుతున్న కృషిని సమీకరించి సమిష్టిగా సమాజానికుపయోగపడే విధంగా, మరింత విస్తృత ప్రాతిపదికతో కార్యక్రమాన్ని చేపట్టి బాలల సర్వతోముఖవికాసానికి తోడ్పడే వ్యవస్థ నొకదానిని ఏర్పాటుచేయాలని సంకల్పించింది మన రాష్ట్రప్రభుత్వం. ఆ సంకల్పఫలితమే గత సంవత్సరం స్థాపింపబడిన "బాలల అకాడమీ".

అఖిలభారతదేశంలో 'బాలల అకాడమీ' ని స్థాపించిన గౌరవం మొదటిసారి మన రాష్ట్రానికే దక్కింది. అందుకు మనల్ని మనమే అభినందించుకోవచ్చు. అయితే ఆరంభంతోనే అయిపోలేదు. అది సాధించవలసింది ఎంతో ఉంది. బాలసాహిత్యాన్ని సృష్టిస్తున్న రచయితలనూ, రచయిత్రులనూ, పత్రికలనూ, అభిమానులనూ, సంస్థలనూ, ఒక వేదికమీదకు తేవాలి. బాలలలో నిత్యనూతన వికాసాన్ని కలిగించే కార్యక్రమాలను చేపట్టాలి. వాటిల్లో బాలల ప్రత్యక్ష ప్రమేయాన్ని కలిగించాలి. జాతినిర్మాణ కార్యక్రమాల్లో తాము చిన్నప్పటినుంచీ పాల్గొంటున్నామన్న ఆత్మవిశ్వాసాన్ని బాలలలో కలిగించాలి. నడుస్తున్న చరిత్రలో వారుకూడా భాగస్వాములు కావాలి. చదువుతున్న పుస్తకాలెంత విజ్ఞానాన్ని ఇస్తాయో చూస్తున్న సమకాలీన సమాజం కూడా అంత విజ్ఞానాన్నిస్తుంది. బాలలు గతంలోనుంచి గొప్పతనాన్ని గ్రహించాలి. వర్తమానంలోనుంచి సత్తువను పెంచుకోవాలి. భవిష్యత్తుకు కావలసిన ముందుచూపు నలవరచుకోవాలి. అన్నిరంగాల్లో నాయకత్వాన్ని వహించే సమగ్ర వ్యక్తిత్వా

లను చిన్న వయస్సులోనే సాధించాలి. అటువంటి అవకాశాలను కల్పించే సంకల్పంతో మనరాష్ట్రప్రభుత్వం 'బాలల అకాడమీ' ప్రారంభించింది.

ఈ సంవత్సరం అకాడమీ రాష్ట్రస్థాయిలో బాలల మహాసభలు జరుపగలుగుతున్నందుకు నేను సంతోషపడుతున్నాను.

బాలల సమస్యల్ని చర్చించుకోవటానికీ, నిర్మాణాత్మకమైన కార్యక్రమాలను రూపొందించుకోవటానికీ, బాలల కళాసాహిత్యప్రతిభలను ప్రదర్శింపచేయటానికీ ఈ సభలు తోడ్పడగలవని నేను గాఢంగా విశ్వసిస్తున్నాను. అకాడమీ భావికార్యక్రమాలకు ఈ సభలు మంచి ప్రాతిపదికలను కల్పిస్తాయని నమ్ముతున్నాను.

ఈ సందర్భంలో 'బాలభారతి' ప్రచురణను యువభారతివారు వెలువరించడం ముదావహం. రేపటి యువతరానికి నేటి బాలతరం ప్రాతిపదిక. బాలభారతి కొన్నాళ్లకు యువభారతి అవుతుంది. ఈ సత్యాన్ని గుర్తించి ప్రాచీనాధునిక సాహిత్య ప్రచారానికి ప్రశంసావహమైన కృషి చేస్తున్న యువభారతి బాలసాహిత్యానికి కూడా సముచిత స్థానాన్నిచ్చినందుకు ఆ సంస్థను అభినందిస్తున్నాను.

ఈ సంపుటిలో 'బాల'మాసపత్రిక సంచికల్లోనుంచి ఎన్నుకొన్న చక్కని రచనలున్నాయి. రేడియో అన్నయ్య, 'అక్కయ్య' (న్యాయపతి రాఘవరావు, న్యాయపతి కామేశ్వరిగార్లు) అందజేసిన ఉత్తేజంతో తెలుగు బాలల వికాసానికి ఎనలేని కృషిచేసిన పత్రిక 'బాల'. సుమారు ముప్పయి ఏళ్ల క్రితం ఆ పత్రికలో వ్రాసిన బాలలందరూ నేడు ప్రౌఢులయారు. అప్పుడు నాటిన మొక్కలన్నీ పెద్దవై ఫలితానికి వచ్చినాయి నేడు. ఆ తరం బాలలకు 'బాల' పత్రిక ప్రతినిధి ఆ బాల పత్రికకు ఈ 'బాల భారతి' ప్రతినిధి. దీని సంకలన కర్త ప్రముఖ గ్రంథాలయోద్యమ కార్యకర్త శ్రీ వెలగా వెంకటప్పయ్యను నేను అభినందిస్తున్నాను.

ఈ 'బాలభారతి' ఈ తరం బాలలకు కూడా ఉత్తేజకం కాగలదని విశ్వసిస్తూ, సంకలనకర్త శ్రీ వెలగా వెంకటప్పయ్య, ప్రచురణకర్తలు యువభారతి వారూ ముందుముందు కూడా ఇలాగే బాలసాహిత్య పరిపుష్టికి కృషి చేయగలరని నేను ఆశిస్తున్నాను.

హైదరాబాదు
ఫిబ్రవరి 10, 1977

మండలి వెంకట కృష్ణారావు

## 'అన్నయ్య' - 'అక్కయ్య' ల మాట

'యువభారతి' కేవలం యువతీ యువకుల విజ్ఞాన ప్రగతి కొరకే ఏర్పడిన ప్రచురణ సంస్థ అని అనుకున్నాము. కాని ఇప్పుడు ఆ సంస్థ కార్యకర్తలు కూడా ఒకనాటి బాలలే అని గుర్తుకొచ్చింది.

పుస్తక ప్రచురణ, పంపిణి వ్యవహారాలలో అనుభవజ్ఞులైన యువభారతి వారు ఇప్పుడు బాలసాహిత్యరంగంలోకి ప్రవేశించడం మాకు చాలా చాలా సంతోషదాయకంగా వుంది.

గమ్మత్తు ఏమిటంటే - ఈ 'బాలభారతి' పుస్తకంలో ఇప్పుడు ప్రచురించినవన్నీ ఒకనాడు అల్లారు ముద్దుగా తెలుగు బాలప్రపంచాన్ని ఉర్రూతలూగించి, బాలవాఙ్మయ రచయితల్ని కదిలించి, ప్రోత్సహించిన మా "బాల" మాస పత్రికలోని రచనల సంకలనమే.

ఈ పుస్తకసంకలనంలో పేజీలు తిరగేసి చూస్తే 1945 సంవత్సరంలో ప్రారంభమయి సుమారు 16 సంవత్సరాలు నడిచిన వెనుకటి "బాల" లలో ప్రచురింపబడిన వివిధ శీర్షికలలోని మచ్చుతునకలు కనిపిస్తాయి. ఆనాడు బాలలలో "చదివే ఆసక్తి" ని పురిగొల్పిన కథలూ, కథానికలూ, నాటికలూ, జోక్సు, నర్సరీ గేయాలు, విజ్ఞాన విషయాలు, రామూ-సోమూ, ఆటుకు-చిటుకు, మాటలు నేర్చుకో, అంకెల తమాషాలు, అక్కతో 5 నిమిషాలు, మాటలతో ఆటలూ. మొదలగు శీర్షికలలో ప్రచురితమైనవి కనిపిస్తాయి. ఇప్పుడు ఇన్ని గమ్మత్తులు గల సమగ్ర ''బాల'' పత్రిక ఒకటివుంటే ఎంత బాగుండును అనిపిస్తోంది. ఉదాహరణకి 37 ఏళ్ళ క్రితం బాలలుగా శ్రీ ముళ్లపూడి వెంకటరమణ వ్రాసిన కథానిక ఏమిటో ఈ పుస్తకంలో చూడవచ్చును. కీ॥ శే॥ చింతా దీక్షితులూ, మునిమాణిక్యం, వేటూరి శివరామ శాస్త్రి, గిడుగు సీతాపతి, మొదలగువారి రచనలు కూడా ఈ పుస్తకంలో చదివి చూడొచ్చు.

ఇటీవలనే ఏర్పడిన "బాలల అకాడమి" యొక్క ఆశయాలలో 'బాల సాహిత్య ప్రచురణ' ఒకటి. ఈ పుస్తకం అకాడమి సహకారంతో వెలువడడం ముదావహం. బాలల అకాడమీ మున్ముందు ప్రచురింపబోవు బాలవాఙ్మయానికి ఇది నాంది అనవచ్చు.

**న్యాయపతి రాఘవరావు, న్యాయపతి కామేశ్వరి**

10-2-1977

'బాల' పత్రిక వ్యవస్థాపకులూ, సంపాదకులూ

1945-1977



# మా మాట

యువభారతి గడచిన పదమూడేండ్లుగా సాధ్యమైనంత తక్కువ వెలకు వీలైనంత ఎక్కువ మందికి ఉత్తమసాహిత్యాన్ని అందిస్తే సాహిత్యంపట్ల ప్రజానీకానికి అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టింది. ఇది **యువభారతి** 56 వ ప్రచురణ. ఇంతవరకు రెండులక్షల ఎనబై వేలకు పైగా ప్రతులను సాధ్యమైనంత తక్కువ వెలకు పాఠకులకు అందించ డానికి పూనుకొంది. యువభారతి సాహితీమిత్ర పథకంలో దాదాపు 5,000 మంది సాహితీమిత్రులుగా చేరారు. ఈ సంఖ్య 10 వేలకు చేరుకోవాలన్న మా లక్ష్య సాధనలో తోడ్పడండి. కేవలం 10రూ॥ చెల్లించి, వెంటనే ఆ మేరకు పుస్తకాలను పొంది, సంవత్సరంపాటు సభ్యత్వాన్ని, నందిని మాసపత్రికనూ, అందుకోండి. వివరాలకు వ్రాయండి.

## "బాలభారతి" గురించి

ఫలించిన స్వప్నాలకు ఆకృతులు కలకలలాడే పిల్లలు. వాళ్ళ ఉజ్జ్వల భవిష్యత్తు జాతి భవిష్యత్తు బాల్యంలోనే వాళ్ళ ఆలోచనలకు పదును. హృదయాలకు వికాసోల్లాసాలు అవసరం. వయో మర్యాదల కనుగుణంగా సాహిత్య ప్రచురణ పశ్చిమ దేశాల్లో విజయవంతంగా శతాబ్దాలుగా సాగుతున్నది. పండితులు, నాగరికులు వయస్తారతమ్యంతో నిమిత్తం లేకుండా బరువైన ప్రౌఢ సాహిత్యాన్ని తమ పిల్లలకు అందిస్తుంటే అమాయకులూ నిరక్షరాస్యులూ అయిన జానపదులు తమ పిల్లలను కథలతోనూ, పొడుపుకథలతోనూ పాటల తోనూ, ఆటలతోనూ అలరిస్తూ బాలసాహిత్య సంపదను సంరక్షించుకుంటూ వచ్చారు. అయితే ఆ జానపదుల బాల సాహిత్యంలో మెదళ్లకు పదును పెట్టే విజ్ఞానం పాలు తక్కువ. ఈ కాలంలో వినోదంతో పాటు వైజ్ఞానిక దృష్టి, పరిసరాలను గురించిన పరిజ్ఞానం అత్యావశ్యకం. పిల్లలకోసం సాహిత్యాన్ని ముమ్మరంగా ప్రచురించే ఉద్యమాలు ఇప్పటికీ మన తెలుగు దేశంలో పుంజుకో లేదంటే సాహసంకానే కాదు. పిల్లల సాహిత్యాన్ని ఎవ్వరూ పట్టించుకోని పరిస్థితులో 'బాలల అన్నయ్య' శ్రీ న్యాపతి రాఘవరావు గారు 'బాల' పత్రికను నిర్వహించి మార్గదర్శకులైనారు. న్యాపతి దంపతులు తెలుగు బాలలకు జాబిల్లీ-నూరీడు. ఆ అమృత హృదయులకు తెలుగు సాహిత్యలోకం ఎంతో ఋణపడి ఉన్నది. వారు నిర్వహించిన 'బాల' పత్రికలోని కొన్ని కథలనూ, కల్ప

కలనూ, వ్యాసాలనూ, గేయాలను ఏర్చికూర్చి 'బాలభారతి'గా రూపొందించి ప్రచురిస్తున్నది యువభారతి.

ఈ సందర్భంగా కొన్ని విషయాలు ప్రస్తావించడం ఉచితమని భావిస్తున్నాము. పిల్లలకై ప్రచురించబడే పుస్తకాలు, ప్రత్యేకత సంతరించుకొని ఉండాలనీ, ఆ ప్రత్యేకత, భాషలో, చెప్పే విధానంలో, ముద్రించే పద్ధతిలో, అలంకరించే తీరులో, అందం చేకూర్చే బొమ్మల కూర్పులో ఎన్నెన్నో విధాల, ఎన్నో బహుళ ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకొని ఈ ప్రత్యేకతలన్నింటినీ పూసగ్రుచ్చాలన్నది. అందరూ గమనించిన విషయమే! *నిజంగా సరసమైన ధరలకు అందించాలన్న విషయం, ప్రత్యేకంగా శ్రద్ధ తీసుకోవలసిన విషయంగా గమనించాలన్నదేమో విజ్ఞప్తి.* ఉడుతా భక్తిగా, యువభారతి ఈ బాలభారతి పుస్తకాన్ని కేవలం ఒక రూపాయికే అందిస్తున్నది. ఎక్కువ ప్రతులు ముద్రించి, ముద్రణ ఖర్చులను తగ్గించి, పటిష్టమైన పంపిణీ పద్ధతి, ఇతర ప్రోత్సాహ పథకాల ద్వారా, విరివిగా అందుబాటులో ఉండేలా చాలా తక్కువ ధరకు అందేలా, అన్ని విద్యాలయాలలోనూ తప్పనిసరిగా ఉండేలా ప్రభుత్వవర్గాల వారూ, దేశభవిష్యత్తుపై నమ్మకం, పిల్లలపై నిజమైన అభిమానం ఉన్న అందరూ కలిసి ఉద్యమరూపంలో పురోగమించవలసిన కార్యరంగంగా బాల సాహిత్య రంగాన్ని ఎన్నుకోవాలని విజ్ఞప్తి.

బాలలకై ప్రత్యేకంగా ఒక పుస్తకం ప్రచురించాలన్న అభిప్రాయం రెండు సంవత్సరాల నుండి మనసులో మెదులుతూనే ఉన్నా, ఈనాటికి సమకూడినందుకు ఆనందిస్తున్నాం. ఈ ప్రచురణ వెలువడటానికి, ముఖ్యంగా సరసమైన ధరకు అందించడానికి అవసరమైన ప్రోత్సాహాన్ని అందించిన ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీకి అకాడమీ అధ్యక్షులు మాన్య శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారికి, ప్రత్యేక కృతజ్ఞతలు. వివిధ సంపుటాల నుండి సంకలనం చేసి యిచ్చిన సహృదయులు గ్రంథాలయ మిత్రులు శ్రీ వెలగా వెంకటప్పయ్య గారికి, కృతజ్ఞతలు. పుస్తక ప్రచారణకు, తమ సహాయ సహకారాల నందించిన శ్రీ బుడ్డిగ సుబ్బరాయన్‌గారికి, శ్రీ రెడ్డి రాఘవయ్యగారికి వందనములు.

ఈ ప్రచురణ, ప్రజాదరణ పొంది, మాకు కొద్దిగానైనా ప్రోత్సాహం కలిగించి, సత్ఫలితాల నిచ్చినట్లయితే - చేతైన మేరకు మరిన్ని ప్రచురణలను అందించడానికి ప్రయత్నిస్తాము.

10-2-1977

ఇరివెంటి కృష్ణమూర్తి

అధ్యక్షుడు.

# పచ్చల తోరణం

బాల మాస పత్రిక బాలానందం రేడియో కార్యక్రమాలు, బాలానంద సంఘం, బాలక్కయ్య, బాలన్నయ్య తెలుగు బాలల సర్వతోముఖ వికాసానికి పర్యాయ పదాలుగా నిలిచాయి. రంగు రంగుల బాలల సుందర సౌధానికి మేలి జిలుగు తెరల వైజయంతిగా వెలుగొందాయి. పిల్లలలో చురుకు దనం, నవ్యోత్సాహం, ఆలోచన శక్తి, నవ చైతన్యం మోసు లెత్తించాయి. దీని వెనుక బాలక్కయ్య, బాలన్నయ్య, రేడియో అక్కయ్య. రేడియో అన్నయ్యలుగా ప్రసిద్ధి గన్న న్యాయపతి కామేశ్వరి, న్యాయపతి రాఘవరావు గార్ల నాలుగు దశాబ్దాల నిండైన కృషి, దీక్ష, త్యాగం, చిత్తశుద్ధి నిబిడీ కృతమై ఉన్నవనే విషయం తెలుగునాట గల నవతరానికి తెలియని విషయం గాదు.

ఆలేఖ్యంగా అనాదృతంగా నిసర్గ మనోహరమైన బాలగేయాలు తెలుగు నాట వందలాది సంవత్సరాలు మౌఖికంగా ప్రచారంలో ఉన్నాయి. వాటిలో చాలభాగాన్ని గిడుగు వెంకట సీతాపతి, వెంకట పార్వతీశ్వర కవులు, వేటూరి ప్రభాకర్ శాస్త్రి, చింతా దీక్షితులు తదితర పెద్దలు సేకరించి - భారతి, ఆంధ్ర పత్రిక, గృహలక్ష్మి, ప్రతిభ మొదలైన పత్రికలలో ప్రచురిస్తూ వచ్చారు. అంతే గాక, సారస్వత మూర్తులు, సాహితీ స్రష్టలుగా పేరొందిన వీరు - తమకు తామై - బాలలలో కలసి - బాలల కోసం రచనలు చేశారు. బాల సాహిత్య సాగర మధనానికి శుభారంభం చేశారు. మామిడి తోరణాలు కట్టారు. మంగళ వాయిద్యాలు మ్రోయించారు. వాటి ప్రతి ప్రతి ధ్వనులు తెలుగుదేశం నలువైర గులా వినిపించేట్లు చేశారు. తత్ఫలితంగా బాలసాహిత్యానికి ఒక చక్కని వాతా వరణం ఏర్పడింది. ఆదరణకు అవకాశం లభించింది.

ఈ శుభ తరుణంలో, అనుకూల వాతావరణంలో బాలల వినోద, విజ్ఞాన వికాసానికి ఒక పత్రిక - ప్రత్యేకంగా ఒక పత్రిక అవసరమని భావించి న్యాయపతి రాఘవరావుగారు 1945 ఆగస్టులో బాల పత్రికను ప్రారంభించారు.

అది నిజంగా సాహసమేనని చెప్పాలి. ఎందుకంటే అప్పటికి బెంగాలీ భాషలో తప్ప, మరే ప్రాంతీయ భాషలో గూడ బాలలకోసం ప్రత్యేకమైన పత్రిక లేదు. పైగా చిన్న పత్రికల నడక అంతంత మాత్రంగా ఉంది. అయితే బాల పత్రిక నిర్వహణలో, రచనల ఎంపికలో రాఘవరావుగారు తీసుకున్న శ్రద్ధ - అది నాలుగు కాలాలపాటు నిలవడానికి దారి తీసింది. బాల తొలి సంచికలో వారు ప్రచురించిన గేయం చూడండి—

అనగా అనగా కోతి
కోతికి కలదూ మూతి
మూతికి పైనే ముక్కు
ముక్కు ముక్కు టిక్కు
డీ డీ డిడి డిక్కు

ఈ విధంగా చిట్టి పొట్టి మాటలలో గేయాలను, కథలను ప్రచురించి హృదయాలను ఆకట్టుకున్నారు. బాల సాహిత్యంలో కొత్త మలుపుకు అంకురార్పణ చేశారు.

పత్రికా రంగంలో బాల పత్రికకు ఒక ప్రత్యేకత ఉంది. విశిష్టత ఉంది. కొత్త శీర్షికలు ప్రవేశ పెట్టడంలో, కొత్త ప్రయోగాలు చేయడంలో "బాల" కు మించినది, సాటి గలది మరి లేదని, నిస్సందేహంగా చెప్పవచ్చు. అంకెల తమాషాలు, చటుకు-చిటుకు, రాము-సోము, చిక్కు ప్రశ్నలు, అతుకుల బొంత కథలు, గొలుసు మాటలు, సెలవుల్లో సరదాలు, అక్కయ్యతో ఐదు నిముషాలు, బాలానందం, పొడుపు కథలు, సామెతలు - మొదలైన అనేక శీర్షికలు తెలుగు బాలల మనోవికాసానికి యితోధికంగా తోడ్పడ్డాయి. వాస్తవానికి తెలుగు బాల సాహిత్యంలో వచ్చిన ప్రక్రియలన్నిటికీ 'బాల' ఒక ప్రయోగశాలగా, పరిశోధనా గారంగా తోడ్పడిందనడంలో సందేహం లేదు.

బాల పత్రికలో మరొక ప్రత్యేకత ఉంది. అన్నయ్యగారు బాలలను లాలించి, ఉబికించి, ఉడికించి వందలాది చిట్టి పొట్టి రచనలు చేయించారు. రేడియోలో వినిపించారు. పసి బాలల చేత హాస్య రసం చిప్పిల జేశారు. ఈ తెలుగు దేశంలో గల చాల మంది కవులు, పండితులు, రచయితలు, భావుకులు సహృదయులు - చాల మంది - ఒకప్పుడు బాల - పత్రిక చదివి ఆనందించిన వారే, తొలి రచనలను అందు ప్రచురించిన వారే. అంతకంటే బాల పత్రికకు

కావలసిన కితాబు ఏముంది? వారందరు యీనాటి బాలమణి కిరీటంలో దగ్ధగాయమానంగా మెరుస్తున్న ముత్యాలు, మాణిక్యాలుగా భాసిస్తున్నారు.

'బాల' మాస పత్రిక-1945 లో ప్రారంభమై 1961 వరకు నడిచింది. కాల ప్రవాహంలో ఎన్నో ఆటుపోటులకు గురైంది. మధ్యమధ్యలో ఆగింది. మరల నడక ప్రారంభించింది. తెలుగు బాలలో ప్రతిభా పాటవాలను పెంపొందించేందుకు ఏర్పడిన ఆంధ్ర ప్రదేశ్ బాలల అకాడమీ తరపున బాల పత్రికను పునరుద్ధరించే అవకాశం కనపడుతున్నది. తెలుగు బాలలకు సుందర భవితవ్యానికి సోపానాలు నిర్మించబడుతున్నాయి.

మరల-యీ శుభ తరుణంలో యువతరానికి పసి తరానికి ఒకప్పుడు 'బాల' మాస పత్రిక చూపించిన వైవిధ్యం, వివిధ రకాల శీర్షికల విశ్లేషణ చవి చూపాలనే సంకల్పంతో యీ సంకలనం - అతి చిన్న స్థాయితో సమకూర్చ బడింది. దాదాపు పదిహేను సంవత్సరాలు మిఠాయి సంచికలను పంచి పెట్టిన 'బాల' పత్రికలోని గంపలలో నిండిన ఫల, పుష్ప సముదాయంలో నుంచి ఉబికిన కొన్ని తేనే సోనలు మాత్రమే యీ చిన్న మిఠాయి పొట్లం. ఇది మీ పైతరానికి ప్రతీకలైన యువభారతి వారు బాలభారతికి యిచ్చే ముద్దుల మురిపాల కానుక. చిన్నారి బాలలను యువభారతి అందించే వేడుక.

'బాల' తో - బాలసాహిత్యంతో నాకున్న సంబంధాన్ని పురస్కరించుకొని సంకలనాన్ని సిద్ధంచేసే అవకాశం కల్పించిన మిత్రులు, యువభారతికి వెన్నెముక వంటివారు, కార్యశీలి వంగపల్లి విశ్వనాథంగారికి. బాల సంపుటాలను యిచ్చి సంకలనకు సూచనలను చేసి తోడ్పడిన అక్కయ్య, అన్నయ్యగార్లకు ఎంతగానో కృతజ్ఞతలు చెప్పవలసి ఉంది. వ్రాత ప్రతిసిద్ధం చేయటంలో ఎంతగానో సహకరించిన సుప్రసిద్ధ బాల సాహిత్య రచయిత రెడ్డి రాఘవయ్యగారికి కూడ ప్రత్యేకంగా కృతజ్ఞతలు తెలుపవలసి ఉంది.

వెలగా వెంకటప్పయ్య
31-1-1977

జిల్లా కేంద్ర గ్రంథాలయము
కడప

 

# రాము సోము

## 1. సైన్సు పేపరులో ఫస్టు

టెస్టుపేపరు : బెస్టు ఆన్సరు : లీస్టుమార్కు

*పరీక్షాధికారి :*

**కొప్పుల బంగారుకొండ · గొల్లప్రోలు**

(ఈ నెలలో రామూ సోములకు పరీక్షలయ్యాయి. ఆంధ్ర ప్రదేశ్ క్రొత్తగా ఏర్పడినందున ఈ ఏడు మన తెలుగు బాలలకు వ్యవసాయంగూర్చి ఏ మాత్రం తెలుసునో అని సైన్సు పేపరంతా వ్యవసాయంగురించే అడిగాను. రామూ అన్ని పేపర్లూ బాగుగానే వ్రాశాడు. కాని సోము సైన్సుపేపరు యీ క్రింది విధంగా వ్రాశాడు. మిగతావి ఎలా వ్రాశాడో మరి !)

ప్రశ్న : నేలదున్నినందువలన లాభములేవి ?

జవాబు : నేలను దున్నుటవలన భూమిలో ముందు యుగంలో దిగబడిన బంగారు బిందెలు, ధనం మూటలు నాగలి కర్రుకు తగులుకొని పైకివచ్చి మనకు లభించును. ఒక్కొక్కసారి చిన్నబిడ్డలుకూడా దొరకవచ్చును. ఉదాహరణకు సీతాదేవి జనకునకు నేలను దున్నేటప్పుడే దొరికినది.

ప్రశ్న : ఒండ్రునేల పంటలకు ఎందుచేత మంచిది ?

జవాబు : తలలోని చుండ్రువలన పేనులు బాగుగా పెరుగునట్లు

నేలలోని ఒండ్రువలన పంటలు బాగుగా పండును.

ప్రశ్న : నేల గుల్ల పడుటకు ఏమి చేయుదువు ?

జవాబు : కొద్దిగా నెయ్యివేస్తే సరి; ఉదాహరణకు మైసూర్‌పాక్ గుల్లగా ఉంటానికి నెయ్యి ఎక్కువగా వేస్తారు. అలాగే యిదీని.

ప్రశ్న : చెట్లు దట్టముగా పెరుగు ప్రదేశము పేరేమి ?

జవాబు : మా ఊళ్ళో రిపబ్లిక్ రేడియో పార్కు.

ప్రశ్న : నీరు అవసరమేమి ?

జవాబు : ఐసు ఫ్రూట్లు చేయుటకు నీరు అవసరము.

ప్రశ్న : ఎండ, వర్షములవలన లాభములేవి ?

జవాబు : ఎక్కువ ఎండగా ఉన్నా, ఎక్కువ వర్షం వచ్చినా అంటే, ఎండాకాలంలోనూ, వర్షాకాలంలోనూ సెలవులు ఎక్కువగా యిస్తారు. కాబట్టి విద్యార్థులకు చాలా లాభం :

-మే, 1957.

---

## 2. ఈ అంకెలు చూడండి !

$$9 \times 9 + 7 = 88$$
$$9 \times 98 + 6 = 888$$
$$9 \times 987 + 5 = 8888$$
$$9 \times 9876 + 4 = 88888$$
$$9 \times 98765 + 3 = 888888$$
$$9 \times 987654 + 2 = 8888888$$
$$9 \times 9876543 + 1 = 88888888$$
$$9 \times 98765432 + 0 = 888888888$$

పంపినవారు : కుచ్చు సుబ్రహ్మణ్యం.

-మార్చి, 1946.

## 3. ముసలమ్మ యుక్తి

రచన : ముళ్లపూడి వెంకటరమణ

(కేసరీ స్కూలు)

ఒక ఊళ్ళో ఒక ముసలమ్మ ఉండేది. పాపం ఆ ముసలమ్మకు కొడుకులూ, బంధువులూ ఎవ్వరూ లేరు. ఎప్పుడూ ఒక రాట్నం పెట్టుకొని దారంతీస్తూ ఉండేది. ఇలా ఉండగా ఒకనాటి రాత్రి ఆ అవ్వ నిద్రపోతూవుంటే. దొంగలు కన్నం తవ్వేరు. ఇంక లోపలికి వస్తారు అనగా, అవ్వకి తెలివొచ్చి, లేచికూర్చుంది, కూర్చుంటే కన్నంలో దొంగలు కనబడ్డారు. అప్పుడు, తన ఇంట్లో ఎవరూ సాయం లేని మూలాన్ని ఒక ఉపాయం పన్నింది. దారం తీస్తూ, కొడుకులు లేకపోయినా పిల్చినట్లు నటిస్తూ మళ్ళీ వాళ్ళు సమాధానం చెబుతున్నట్లు తనగొంతు మార్చుకుంటూ,

ముద్దుల మువ్వనా ! లేరా నా కొడకా !
ఊ ! ఆ ! లేచానోయమ్మ !

గంటల కావన్నా ! లేరా నా కొడకా !
ఊ ! ఆ ! లేచానోమమ్మా !

పచ్చని బసవన్నా ! లేరా నా కొడకా !
ఊ! ఆ! లేచానోయమ్మా !

వెంకటగిరి రామా ! లేరా నా కొడకా !
ఊ ! ఆ ! లేచానోయమ్మా !

అని పాడింది.

అప్పుడేమైందంటే, అయ్యో అవ్వకి నలుగురు కొడుకుల్లా ఉంది. వాళ్ళు లేచారంటే మనం దొరికి పోతామని భయపడి దొంగలు పారిపోయారు. తనయుక్తి బాగా పారినందుకు ముసలమ్మ చాలా సంతోషించింది.

—జూన్, 1746

# 4. నెహ్రూ దినచర్య

రచన : భాగ్య వెంకటేశ్వర్

"శ్రీ నెహ్రూ ప్రతిరోజూ ఉదయం ఆరు గంటలకు నిద్ర నుండి లేస్తారు. శీర్షాసనం, శరీర వ్యాయామం చేస్తారు. తరువాత క్షురకర్మ, స్నానం చేయటం ఒక అర గంటలో ముగిస్తారు. ఆయన ప్రపంచంలో ఏ మూలనున్నా సరే, యీ కార్యక్రమం తూ.చా. తప్పకుండా ప్రతి ఉదయం జరిగి తీరవలసిందే" అన్నాడు హరి.

హరి శ్రీ నెహ్రూ నౌకరు. మేము చౌక రకపు రైలు టిక్కట్లు కొనుక్కొని, ఆమధ్య కలకత్తా, కాశీ, ఢిల్లీ, కాశ్మీర్, ఆగ్రా, బొంబాయి, పూనా మొదలైన పట్టణాలన్నీ చూశాము. మా అదృష్టవశాత్తు మేము వెళ్లేటప్పటికి శ్రీ నెహ్రూ రాజధాని నగరంలోనే ఉన్నారు. కాని ఆయనతో మాట్లాడటానికి వీలు దొరకలేదు మాకు. దూరంనుంచే ఆయన దర్శనం చేసుకున్నాం.

శ్రీ నెహ్రూ నివాసం, ఢిల్లీలో పెద్ద రాజభవనం. పూర్వం దానిలో బ్రిటీషు సేనానాయకుడు వుండేవాడట. ఆ భవనం ఆవరణంలోనే మేము హరిని కలుసుకున్నాం.

"ఉదయం కార్యక్రమమైన తరువాత శ్రీ నెహ్రూ వార్తా పత్రికలు చదువుతారు." అన్నాడు హరి.

"ఆయన కథలు చదువుతారా?" అని ఆత్రంగా అడిగాను.

"ఆయనకు కథలంటే ఇష్టం ఉన్నట్లు లేదు. ఆయనెప్పుడూ కథలు చదవటం నేను చూడలేదు.

"తరువాతః"

"తర్వాత ఆయన పరిమితంగా కాఫీ, ఫలహారాలు పుచ్చుకొని, విదేశాంగమంత్రివర్గ కార్యాలయానికి, ఇంచుమించు ఎనిమిదిన్నరా, తొమ్మిది గంటలూ ఆ ప్రాంతంలో వెళ్తారు.

మధ్యాహ్నం పూట, శ్రీ నెహ్రూ జ్ఞాపకముండి పని తొందర లేకపోతే, భోజనానికి వస్తారు. నేను షుమారు ముప్పై ఏళ్లనుండి

ఆయన్ను సేవిస్తూ ఉన్నాను. మొదట్లో ఆయనకు వేడి వేడి ఆహార పదార్థాలుంటేగాని భుజించేవారు కారు. వంటకాలు ఏ మాత్రం చల్లారిపోయిఉన్నా వాటిని వంటవాని ముఖానికేసి కొట్టేసేవారు; అంతకోపం ఆయనకు అప్పట్లో ఉండేది. కాని రానురాను ఆయన కోపం చాలావరకు నశించింది. ఇప్పుడాయనకు ఆహారం తీసుకోవటానికే తీరిక ఉండటంలేదు. ఇక దానిమీద శ్రద్ధేం ఉంటుంది? అన్నాడు హరి.

అవును నిజమే - ఆ మధ్య నేను పేపర్లో ఆయన ఉపన్యాసం చదివాను. ఒక విద్యార్థుల సభలో మాట్లాడుతూ శరీరారోగ్యానికి; దేహపరిశ్రమ, ఆహార విహారాదులలో నియమం, చేతినిండా పని ఉంటే ఔషధము అవసరంలేదు" అన్నారాయన.

"బాల బాలికలంటే ఆయన కిష్టమేనా?" అని అడిగాను.

"ఆఁ! పిల్లలంటే ఆయన కెంతో ప్రాణం. ఆయన మనుమలైన "రాజీవ్" "సంజయ్"లపై ఆయన కెంతో అనురాగం. కాని వాళ్లతో భోజన సమయాల్లోనే గాని ఇతర సమయాల్లో ముచ్చటించటానికి కాయనకు తీరిక యేది?

"అక్కడికీ-సాయంత్రం పూట ఒక్కొక్కసారి తన వ్యవహారాల నన్నిటినీ కొంతసేపు మరచిపోయి, తన మనుమలతో తోటలో దాగుడుమూత లాడుకొంటారు" అన్నాడు హరి చిరునవ్వుతూ.

"ఆ తరువాత?"

"ఆ తర్వాత ఆయన స్వదేశ వ్యవహారాలను, విదేశ వ్యవహారాలను రాత్రి ప పన్నెండు గంటలకో, ఒంటిగంటకో ముగించుకొని, తన పడకగదిలోకి వెళ్తారు. అక్కడఉన్న మహాత్మా గాంధీ విగ్రహాన్ని తదేక దీక్షతో కొన్ని క్షణాలపాటు చూస్తూ అలాగే నిలబడి పోతారు.

"ఈశ్వర, అల్లా తేరేనాం.
సబ్ కో సన్మతి దేభగవాన్"

అని పలుకుతారు." అని వారి చెబుతూండగానే భవనంలోంచి ఒక బంట్రోతు వచ్చి అతన్ని లోపలికి పిల్చుకొని పోయాడు.

మన నాయకుడు పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ 67వ జన్మదినోత్సవం, యీ నెల (నవంబరు) 14 వ తేదిన, మన భారత దేశంలోనే గాక, కొన్ని విదేశాల్లో కూడా జరుపుతారు.

మన "మహా నాయకుని" శ్రేయోభిలాషులమైన మనంకూడ ముఖ్యంగా బాల బాలికలం, ఉల్లాసంగా శ్రీ నెహ్రూ జన్మ దినోత్స వాలలో పాల్గొందాం. మన చిరకాల వాంఛితమైన "విశాలాంధ్ర" సిద్ధించిన సంతోష సమయంలో, శ్రీ నెహ్రూ జన్మదినోత్సవాన్ని మరింత ఉత్సాహంగా చేసుకుందాం-జై హింద్.

—నవంబరు, 1956,

---

## 5. తాతయ్యా తాతయ్యా

తాతయ్యా తాతయ్యా
గాంధి తాతయ్యా
తాతయ్యా నవ్వితే
వెన్నెలలు వెలుగు
తాతయ్యా పలికితే
ముత్యాలు రాలు
తాతయ్యా మాటలే
రత్నాల మూట
తాతయ్యా తాతయ్యా
గాంధి తాతయ్యా

—కె. సభా సెప్టెంబరు, 1945.

---

## 6. కోడీ కోడీ కొక్కొ్రకో

(సంపాదన: చింతా దీక్షితులు)

కోడీ కోడీ - కొక్కొ్రకో!
కాకీ కాకీ - కావ్ కావ్!
తెల్లవారింది
తెలివి వచ్చింది
అమ్మ లెమ్మంది
ఆడుకోమ్మంది

-సెప్టెంబరు, 1945.

## 7. దాగుడు పేర్లు

కూర్పు : గండికోట వెంకటలక్ష్మి (ఖర్గపురము)

1

బాలా !

నేను ఒక చెట్టుని నా కాయలు అందరూ తింటారు.
కొత్తలో ఉన్నాను గాని పాతలో లేను
పబ్బములో ఉన్నాను గాని పండుగలో లేను.
వరిలో ఉన్నానుగాని జొన్నలో లేను.
నేను ఎవరినో పోల్చుకోండి.

2

నా పేరు నాల్గు అక్షరాలు, నేను ఆంధ్రుల పట్టణాన్ని.
మంచిలో ఉన్నానుగాని చెడ్డలో లేను.
వేదములో ఉన్నానుగాని సామములోలేను.
రాత్రిలో ఉన్నానుగాని పగలులో లేను.
పసుపులో ఉన్నాను గాని కుంకుమలో లేను.
నా పేరేమిటో చెప్పుకోండి. మార్చి 1949.

---

## 8. లెక్కలు - డొక్కలు

రచన; కవికొండల వెంకటరావు

1 హైజంప్ - ఒకగీత
11 పారెలర్ బార్ - రెండు గీతలు
111 క్రికెట్ - మూడు గీతలు
1111 నాలుగు స్తంబాలాట-నాలుగుగీతలు
11111 హార్డిల్సు - అయిదు గీతలు
┌─┬─┐ ఫుట్ బాల్ - ఆరు గీతలు
ఆడుకో అబ్బాయ్ ఆడుకో-

అక్టోబరు-1947.

## 9. అతుకు బొంతుకులకథ

### అతికితినే అందం

### కూర్పు: "అన్నయ్య"

అనగా అనగా ఒక అడవి చివర జంతువులన్నీ అయిపోయాయి. నక్క రోజుకొక సింహానికి పాలిస్తూ ఉండేది. ఒక నక్క అడవిని మంత్రిగా ఉండేది. ఒక పులి వచ్చేది. అప్పుడింకెలాగ? అది రానంటోంది. మీరేవెళ్ళి గుటకాయ స్వాహాచేసింది. ఒక సింహం ఇలా ఉండగా వుండగా ఆ సింహం పుట్టింది. రాజుగారి తనను చంపి తినండి, అంది జంతువును చంపేస్తుందని ఆ అడవిలో నక్కకు" ఎందు కంత దూరం యిప్పుడూ? ఆహారానికి గాను ఇంక పిలుచుకొని భయం సింహంతో యిలా ఒక ఉపాయం ఆలోచించి వెంటనే ఆనక్కని ఒక్కదూకు దూకి నువ్వున్నావుగా యిరోజుకి అని అంది: మృగరాజా యీ సింహం ఉంది.

-(ఈ పై అతుకు బొంతుకుల కథలోని మాటలన్నీ సరిగా చేర్చినచో సరియైన కథ ఏర్పడుతుంది.)

జ వా బు

అనగా అనగా ఒక అడవిని ఒక సింహం పాలిస్తూ ఉండేది. ఒక నక్క సింహానికి మంత్రిగా ఉండేది. నక్క రోజుకొక జంతువును రాజుగారి ఆహారానికి గానూ పిలుచుకొని వచ్చేది. ఇలా ఉండగా ఆ అడవిలోని జంతువులన్నీ అయిపోయాయి. అప్పుడింకెలాగా? సింహం ఇంక తనను చంపేస్తుందని నక్కకు భయం పుట్టింది. వెంటనే ఒక ఉపాయం ఆలోచించి సింహంతో యిలాఅంది. "మృగరాజా యీ అడవి చివర ఒక పులి ఉంది. అదిరానంటోంది. మీరే వెళ్లి చంపి తినండి" అంది.

సింహం ఎందుకంత దూరం యిప్పుడూ? నువ్వున్నావుగా యీరోజుకి అని ఒక్క దూకు దూకి ఆనక్కని గుటకాయ స్వాహా చేసింది.

—సెప్టెంబరు-అక్టోబరు-1956

# 10. మత్తూ - సత్తూ

రచన : మునిమాణిక్యం

అనంగా అనంగా ఓ పెద్ద అడవి. ఆ అడవిలో ఒక కొండ ఉన్నది. ఆ కొండ పేరు రాక్షసులకొండ. ఆ పేరు ఎందుకొచ్చింది అంటే, ఆ కొండపైన ఒక ప్రక్కన ఒక రాక్షసుడు, రెండో ప్రక్కన ఇంకో రాక్షసుడు ఉంటూ ఉండేవాళ్లు.

ఆ కొండకు కుడి ప్రక్కనున్న రాక్షసుడి పేరు మత్తు, ఎడమ ప్రక్కనున్న రాక్షసుని పేరు సత్తు.

ఆ ఇద్దరూ భయంకరాకారులు. ఒక్కొక్కడు ఎనిమిది అడుగుల ఎత్తు. ఇద్దరికీ బుట్ట మీసాలున్నవి. వాళ్ల కళ్లు ఎఱ్ఱగా చింత నిప్పులలాగ ఉండేవి. తలలపైన జుట్టు పెరిగి బుజాలదాకా వ్రేలాడుతూ ఉండేది.

చూడటానికి ఇంత భయంకరంగా ఉన్నా; ఇద్దరూ మంచి వాళ్ళే. వాళ్లు ఒకరి జోలికీ, శొంఠికీ పోరు. అసలు ఆ అడవిలో మనుష్యులే లేరు. ఎవరైనా, అటొస్తే వాళ్ళను ఈ రాక్షసులు ఏమీ అనేవాళ్లుకారు.

వాడికో గుహ, వీడికో గుహ ఉండేవి. ఎవరి గుహలో వారు ఉండేవారు. తెల్లవారటంతోనే ఆ కొండ కుడివైపునుంచి మత్తూ ఎడమవైపునుంచి సత్తూవచ్చేవాళ్ళు - దగ్గరలో ఉన్ననది దగ్గరకు. ఇద్దరూ కాసేపు ఈత కొట్టి, శుభ్రంగా స్నానం చేసి, ఎవరి గుహలోకి వాళ్లు వెళ్లిపోయేవారు.

తరువాత వాళ్లు మంచి బట్టలు వేసుకొని, విల్లంబులు, బాణాలు, కత్తులు, కటారులు, బల్లాలు తీసుకొని ఎవరి దారినివారు వేటకు వెళ్ళి, జంతువులను చంపుకొని తమ తమ గుహల్లోకి తెచ్చుకొనేవాళ్ళు.

సత్తుకు నాలుగు మేకలో, రెండు ఎడ్లో తింటే సరిపోయేది. సత్తు చాలా జాగ్రత్త మనిషి. ప్రొద్దున తెచ్చుకున్న దాంట్లోనే

కాస్త రాత్రికి అట్టిపెట్టుకొనేవాడు. రాత్రికి ఆ మాంసంతిని, నెగడు దగ్గర పడుకొని హాయిగా నిద్ర పోయేవాడు.

మత్తు తిండిపోతు. పది మేకలు తింటేనేగాని అతనికి కడుపు నిండేదికాదు. లొట్టలేస్తూ పది మేకలూ తిని, అతడు గడ్డిపై పడుకొని నిద్రపోయేవాడు.

మత్తు ఒట్టి సోమరిపోతుకూడాను. రాత్రి భోజనానికి ముందుగా జాగ్రత్తపడేవాడుకాదు. ఉంటే తినేవాడు; లేకపోతే సత్తును అడిగితెచ్చుకొనేవాడు.

సత్తు పాపం మంచివాడు. అయితే ఎప్పుడైనా అడిగితే కాస్తం మాంసం ఇస్తారుగాని ఎవరైనా, రోజూ అడుగుతుంటే ఎట్లా? సత్తు చీవాట్లు వేస్తూనే ఉండేవాడు; ఇస్తూనే ఉండేవాడు.

మత్తుకు సోమరితనం మరీ బలిసిపోయింది.

ఒక రోజున మత్తు కడుపునిండా తిని, బ్రేవ్‌మని త్రేన్చి పెద్దగా ఆవలించి, పడుకొని నిద్రపోయినాడు. వీడినిద్ర బంగారం గాను, అదేమి నిద్ర? పెద్ద గురక పెట్టాడు.

సాయంత్రం పశువులు, లేగదూడలను పిలుస్తూ ఇంటికి పోతున్నవి; కాకులు అరుస్తూ గూళ్లకు చేరుతున్నవి. అప్పుడు మత్తు అల్లా విరుచుకొని లేచి-

మత్తు : (నిద్రమత్తుగా : స్వగతం) ప్రొద్దుగూకింది. ఇప్పుడు ఎవరెళ్లుతారు అడవిలోకి? నేవెళ్ళలేను. - సత్తు దగ్గర చాలా మాంసం ఉంటుంది. "సత్తూ, సత్తూ! రెండు బుట్టలమాంసం పంపించరా-తింటాను. ఆకలి అవుతున్నాది." సత్తుగాడు ఇంట్లో లేడేమో నిద్రపోతాను.

(అని మళ్ళీ పడుకొన్నాడు)

ఒకటే నిద్ర. (గురక)

అర్ధరాత్రి అయింది, ఇలకోళ్లు అరుస్తున్నవి. మత్తు నిద్ర లేచాడు, వళ్ళువిరుచుకొని...

మత్తు : అబ్బా! అర్ధరాత్రి అయినట్లుంది. ఆకలి అవుతున్నది; సత్తూ! - సత్తూ! ఆకలిరా! మాంసం!

సత్తు : ఒరేయ్ మత్తూ, అర్థరాత్రివేళ తే లేపవద్దని నీకు ఎన్నిసార్లు చెప్పాను? నీవు సోమరిపోతువు, నీకు ఏమీ ఇయ్యకూడదు.

మత్తు : ఈ ఒక్కసారి ఇయ్యి. ఇక అడగనులే, అబ్బా, ఆకలిరా!

సత్తు : సరే ఇస్తాను. ఇక ఎప్పుడూ అడగకు...

మత్తు : (పెద్దగా నవ్వి) ఇక ఎప్పుడూ ఇయ్యవూ (నవ్వి) ఇస్తావులే! అల్లాగే కొన్నాళ్లు గడిచినది. ఎన్నాళ్ళకు మత్తు తన పద్ధతులను మార్చుకొని బాగుపడలేదు. ఒకరోజున పిడుగులు, వర్షము, గాలి.

మత్తు : (పెద్దగా) సత్తూ! ఉహూ హూ అబ్బా! ఊ! హూ, హు, సత్తూ, సత్తూ ఆకలి, మాంసం ఇయ్యరా, ఊహుహూ! (పిడుగు, వాన, గాలి) చలి కుంపటి కావాలిరా; కుంపటి-చలి-ఆకలి.

సత్తు : నీకు ఎన్నోసార్లు చెప్పాను సోమరిగా ఉండవద్దని; బాగుపడమని, మళ్ళీ నన్ను అర్థరాత్రి వేళ నిద్ర లేపావు. నీకు ఏమి ఇయ్యను, ఇయ్యను.
(పిడుగు, గాలి, వర్షము)

మత్తు : ఉహూహూ-చలి, కుంపటి ఇయ్యరా సత్తూ, మాంసం, ఆకలి, అబ్బా, చలీ, చచ్చిపోతున్నానురోయ్; సత్తూ సత్తూ!

సత్తు : సోమరిపోతా! ఇయ్యను, ఏమి ఇయ్యను, చావు!

మత్తు : సత్తూ సత్తూ ఊహూ - చలి - చచ్చిపోతున్నాను, వానకు తడిసిపోయినాను, ఊహూహూ, చలికి నరాలు బిగుసుకు పోతున్నవి. (వానచప్పుడు) చలి, చలి, చస్తున్నా!

సత్తు : చావు సోమరి వెధవా!

మత్తు : చలి-ఉహూహూ, చలి, (మూల్గాడు).

తెల్లవారింది. మత్తు ఏమైపోయినాడో, పాపం-రాత్రి వానలో తడిసి చచ్చిపోయినాడేమో!

(ఆకాశవాణి హైదరాబాదు సౌజన్యంతో)

-సెప్టెంబరు, 1958.

గేయనాటిక:

# 11. కుంటీ - గ్రుడ్డీ

రచన: **న్యాయపతి రాఘవరావు**

రంగము :-1

(తెర ఎత్తగానే ఒక సోఫా ఉంటుంది)
(నేపథ్యమున పాట)

అనగా అనగా ఉన్నాడండీ
జమీందారుగారూ-ఒక
జమీందారుగారూ...

(ఒక జమీందారు దర్జాగా నడుస్తూ ప్రవేశం. కుర్చీలో కూర్చుంటాడు)

జమీందారుకొక కొడుకున్నాడూ
బాబ్జీ దొరగారూ
కోటూబూటూ హాటూ సూటూ,
బాబ్జీ దొరగారూ...

(బాబ్జీ ప్రవేశం)

గోటుకేమియూ లోటులేదయా
బాబ్జీ దొరగారూ
ఆటలకెన్నో వస్తువులున్నై
బాబ్జీ దొరకండీ, ఆ-
నౌఖరికుర్రడు వెంకడువానికి
సేవచేయునండీ.

(నౌఖరు కుర్రవాడు ఆటవస్తువులు తెస్తాడు)

చెప్పిన పనులను తప్పక చేయుచు
సేవ చేయునండీ;
ఇంతలోనే వొక గ్రుడ్డిపిల్ల నట
కొచ్చె బిచ్చమెత్తా

జీవితమే ఒక అంధకారమూ
బిచ్చపిల్లకండీ-ఆ
బిచ్చపిల్లకండీ

బిచ్చపిల్ల : (పాట)
ఈయండో ఓ అమ్మల్లారా॥
పైసా ఒక పైసా
ఆకటి బాధతో అలిసినాను
నన్నాదరించి ఈయండీ॥
పైసా ఒక పైసా.
లక్షాధికార్లు మీరూ
బిచ్చపిల్ల నేనూ
ఇచ్చినా దానంబున కూ
మెచ్చు మిమ్ము భగవాన్
భగవాన్ భగవాన్ ॥ఈ॥

జమీందారు: పోవమ్మా పో, పో—

బిచ్చపిల్ల : బాబూ ! గుడ్డిదాన్ని, ధరమం చేయండి బాబూ !

బాబ్జీ : పొమ్మని చెప్తే వినబడలేదూ, ఒరే వెంకడూ ! దాన్ని బయటికి తరుము :..

(వెంకడు చేతులు జోడించు కొనినిలుచుంటాడు)

ఊఁ... వెళ్లు... చూస్తూ నిలుచుంటావేమీ ?

వెంకడు ; గుడ్డిపిల్ల బాబూ !

బాబ్జీ : (కొరడాతీసి) వెళ్తావా, కొట్టమన్నావా? పో, పో, దొంగ వేషాలూ, నువ్వూ !

బిచ్చగత్తె: కొట్టకండి బాబూ ! పోతాను.

(పాట) : లక్షాధికార్లు మీరు
బిచ్చపిల్లనూ నేనూ
ఇచ్చినదానంబున-కూ

మెచ్చు మిమ్ములను భగవాన్
భగవాన్, భగవాన్ ?

**బాబ్జీ :** ఏమిరా ! నేను చెప్తే నా మాట నువ్వెందుకు వినలేదూ?
ఊఁ...ఇలారా : వీపువంచు, గుఱ్ఱం ఎక్కుతాను;
ఊఁ...ఒంగో :
చల్ చల్ చల్ చల్ ఘోడాచల్.

**వెంకడు :** (కష్టంతో మోస్తూ, పడిపోతాడు, బాధపడతాడు)

**బాబ్జీ :** (వెంకడ్ని కొడతాడు).

(నేపథ్యమున కోరస్)

అయ్యో నొప్పి బాబోయ్ నొప్పి
అనును ఏడ్చెనండీ—
వెంక డేడ్చెనండీ...
కనికరమేమియు లేక కొట్టెనా
బాబ్జీ దొరగారూ,
పర పర పర పర కొరడా తీసీ
కొట్టె మోముపై నా
పక పక పక పక తండ్రి నవ్వుచు
తమాషాను చూడా.
అయ్యో అయ్యో, కంటిమీదనే
దెబ్బకొట్టెనండీ...
గాయపడిన ఆ బాలుడు
ఏడ్చుచుపోయె ఇంటికపుడూ

(తెర)

రంగము :-2

(తల్లి కూర్చొని ఉండగా కొడుకు ఏడుస్తూ, గ్రుడ్డివానిగా నడుస్తూ, తల్లిదగ్గరికి వస్తాడు.)

**తల్లి ;** (పాట) అయ్యో నాయనా !
అయ్యయ్యో నాయనా !

ఒక్కడవే
నీ వొక్కడవే
నా దిక్కు అనుచు నేనుండా
అక్కటకక్కటా
అంధుడవై తివి
ఆశలన్ని పోవా
నా ఆశలన్ని పోవా
అయ్యో; నాయనా !
అయ్యయ్యో ! నాయనా;

బిచ్చపిల్ల : (తడుముకుంటూవచ్చి ) ఈయండో అమ్మల్లారా
పైసా ఒక పైసా !
ఆకటి బాధతో అలసినాను
నన్నా - దరించి ఈయండీ;
పైసా, ఒకపైసా;

తల్లి : రా అమ్మా ఇటురా !
రా అమ్మా ఇటురా॥
నీతో కలియును
నా కుమారుడూ
బిచ్చవృత్తిలోనా
బిచ్చవృత్తిలోనా
రా అమ్మా ఇటురా !
రా అమ్మా ఇటురా ॥

బిచ్చపిల్ల మరియు వెంకడు :
ఈయండో అమ్మల్లారా
పైసా ఒక పైసా
(వాలంటీర్లు ప్రవేశం)
బాలల్లారా రారండూ
బాలల్లారా లేలెండూ,
భారతదేశం మనదేనోయ్

బాలలరాజ్యం స్థాపిద్దాం
బాలల జెండా ఎగరేద్దాం
గోదావరి కృష్ణ పెన్నా
తుంగభద్ర యందున్న
గంగను అంతయు పట్టేద్దాం
బంగరుపంటలు పండిద్దాం
నింగిని జెండా ఎగరేద్దాం
అజ్ఞానంబను చీకట్లో
అల్లల్లాడూ బాలలకు
అనలే బడులు లేకుంటే
ఇంటింటొక బడి పెట్టేద్దాం...
విజ్ఞానం వెదజల్లేద్దాం...
వెదజల్లేద్దాం...

గ్రుడ్డివారు: ఎవరయ్యా మీరూ ?
ఎవరయ్యా మీరూ ?

బాలభటులు : నూతన భారత నిర్మాతలము
ప్రజా సేవకులమూ
ప్రజా సేవకులమూ
ఓ అమ్మాయి నీ వెవరు ?

గ్రుడ్డివారు: కన్నులులేని బీద బాలికను
కనికరించరయ్యా
కుంటి గ్రుడ్డివారి క్షేమము
ప్రజా సేవకాదా
ప్రజా సేవకాదా
కనికరించరయ్యా !

బాలభటులు : రా అమ్మా ఇటు రా
ప్రజా ప్రభుత్వపు
ప్రణాళికను మే
మనుసరించుతాము ॥రా అమ్మా॥

శిశు సంక్షేమం
మహిళల క్షేమం
కోరుచు ఎన్నో సంస్థల
బెట్టగ పూనివచ్చినామూ
గ్రుడ్డివారు చదవొచ్చండి
ఇదిగిదుగో చదవండీ !
(ప్రవేశం-గ్రుడ్డివారు)
గ్రుడ్డివారు పాడొచ్చండీ
ఇడిగిదుగో పాడండి
కుంటీ గ్రుడ్డీ పని చెయొచ్చండీ
బుట్టలు ఇవిగో అల్లండీ
బిచ్చమెత్తుకొని జీవించక ఇక
వృత్తి విద్యలే నేర్వండీ...
(వికలాంగుల వృత్తి విద్యల్ని చూపే దృశ్యాలు)
(కోరస్ అందరూ)
వీర బాలలార రండు
వీర బాలలార లెండు
బాల భారతమ్మ కిదుగో
పూలహారమూ
బాల భారతమ్మ భావి
బాలలయందే వుంది
బాలలరాజ్యం బలేరాజ్యమోయ్
కులభేదం మతద్వేషం
లేని రాజ్యమోయ్
బాలల రాజ్యం స్థాపిద్దాం
బాలల జెండా ఎగరేద్దాం
భావిభారత కీర్తిని ఇక మన
బాలలమే నిలబెడదాం
మన బాలలమే నిలబెడదాం
మన బాలలమే నిలబెడదాం !

—: (తెర) :— —సెప్టెంబరు. 1958.

# 12. కొంటె కిష్టయ్య - గడుసుతనం !

రచన: "చందర్"

బాలచంద్ర సమాజము (త్రిప్లికేను)

ఒక రోజు సాయంకాలము నేను కొంటె కిష్టయ్య యింటికి వెళ్ళేను. వాడు ఏదో మహాదీక్షతో వ్రాస్తూండేసరికి నాకే ఆశ్చర్యం వేసింది.

దగ్గరగా వెళ్ళి, "ఏమిట్రా రాస్తున్నా ?" వని అడిగాను.

కిష్టయ్య : మరేం లేదురా! బాలపోటీ పరీక్షకి వ్యాసం రాస్తున్నా; బహుమానం వస్తుందని.

నేను : నీ మొహం ! నీకూ నాకూ వచ్చేదేమిటి ? మనకంటే పెద్ద బుర్ర ఉన్నవాళ్లందరూ రాస్తారు.

కిష్టయ్య : భూతద్దము పెట్టి చూడు; నాబుర్రా పెద్దదిగానే కనబడుతుంది.

నేను : బుర్రంటే తెలివనే అర్థంతో చెప్తున్నా ! అవును కాని నీకు మొదటి బహుమానం వస్తుందంటావా ?.

కిష్టయ్య : మొదటి బహుమానం మాట చెప్పలేను గాని...

నేను : ఓహో ! అయితే ఏదేనా బహుమానం వస్తుందని ఆశగా ఉంది కాబోలు.

కిష్టయ్య : అవును. ఏదో ఒక మానంవస్తుందని నొక్కి చెప్పగలను.

నేను : పందెం—నీకు రాదు.

కిష్టయ్య : పందెం ! నేను గెలిస్తే నీవు నాకు పదిరూపాయలు, నీవు గెలిస్తే నేను నీకు పదిరూపాయలు ఇచ్చుకోవాలి.

నేను : సరే !

..........................

కిష్టయ్యకి బహుమానం రాలేదు. నేను గబగబా కిష్టయ్య ఇంటికి వెళ్లాను, పందెం వోడిపోయినందుకు పది రూపాయలు అడి

(తరువాయి పేజీ చూడండి)

# 13. అక్కతో 5 నిమిషాలు

రచన: **కామేశ్వరి**

**చెల్లాయిలూ, తమ్ముళ్లూ!**

సంక్రాంతి పండుగ వచ్చింది. మీ అందరికి నా సంక్రాంతి ఆశీర్వచనాలు.

చిట్టి తమ్ముళ్లూ, చెల్లాయిలూ భోగిపళ్లు పోసుకున్నారనుకుంటాను. కొత్తబట్టలు కట్టుకున్నారా? అసలు ఈ సంక్రాంతి అంతా ఎందుకో తెలుసా?

సూర్యుడు, దక్షిణాయనం - అంటే మన దేశానికి ఎంతో దూరంగా దక్షిణంగా ఇన్నాళ్లూ తన రథమెక్కి వెళ్ళాడు. ఈ రోజు నుంచీ ఆ రథం మళ్లించి తిరిగి ఉత్తర దిక్కుగా ప్రయాణం చేస్తాడు. అంటే, మన దేశానికి దగ్గరగా వస్తాడు. భూమిమీద కాదు సుమండీ-ఆకాశంమీదే.

అందుచేతే మనకి చలిపోయి, హాయిగా వసంతకాలం, తర్వాత సూర్యుడు ఇంకా దగ్గరకు వచ్చినకొద్దీ ఎండాకాలం వస్తుంది.

ఋతువులు మారి, చక్కని హాయినిచ్చే రోజులు వస్తాయి గనుక, యీ పండుగ చేసుకుంటాం? తెలిసిందా?

—జనవరి. 1946.

---

గాను. కిష్టయ్య నవ్వుతూ ఇలా అన్నాడు:

కిష్టయ్య: నాకు యీ పోటీలో అవమానం వచ్చింది. మన పందెం ప్రకారం ఏదో ఒక మానం వస్తుందన్నాను; గనుక నేనే గెలిచాను. నువ్వే నాకు పది రూపాయలు ఇవ్వాలి.

నేను తెల్లబోయి చూచాను. చూశారా, కొంటె కిష్టయ్య గడుసుతనం!

—మార్చి, 1947.

# 14. న్యూటన్ కథ

రచన : మునుగంటి శ్రీరామమూర్తి

కాకినాడ

అనగా అనగా ఒక ఊరు. ఆ ఊరు ఎక్కడ ఉందో తెలుసా? సీమదేశమంటాం! ఆ దేశంలో వుంది. అక్కడ మన ముత్తాతలనాటి కాలంలో ఒక పిల్లాడుండేవాడు. అతని పేరు 'న్యూటన్'.

న్యూటన్ చాలా తెలివైనవాడూ, మంచి పిల్లవాడూను. ఇంటి దగ్గర ఎప్పుడూ తమ్ముళ్ళని, చెల్లెళ్ళని కొట్టేవాడు కాదు. బళ్ళో తోడిపిల్లలతో ఎప్పుడూ దెబ్బలాడేవాడు కాదు. జాగ్రత్తగా గురువుగారు చెప్పిన పాఠాల్ని వల్లిస్తూ, బాగా చదువుకునేవాడు. ఎప్పుడూ ఆకాశంవైపు చూస్తూ 'సూర్యుడల్లాగ ఎందుకు ప్రయాణం చేస్తున్నాడు? తూర్పు దిక్కున రోజూ ఉదయం ఎందుకు ఉదయించాలి? పడమట్ని సాయంత్రం ఎందుకు అస్తమించాలి? ఆ విధంగా ఆకాశంమీద ప్రయాణం చేస్తున్నప్పుడు ఆకాశం మీదనుంచి ఎందుకు క్రింద పడిపోవడం లేదు? సూర్యుణ్ణి ఆకాశంనుండి పడిపోకుండ వాళ్ళమ్మ కాపాడుతుందా? ఆమె ఏంచేస్తుంది?' అని ఎప్పుడూ ఈ విధంగా ఆలోచిస్తూ ఉండే-వాడట. పెద్దవాడైన తరువాతకూడా అతనికి ఆలోచన తగ్గలేదు.

ఇల్లా చాలా రోజులు గడిచేయి. ఒకరోజున అతడు ఒక్కడే ఒక రేగు చెట్టుక్రింద కూర్చొని, మళ్ళీ దానిని గురించే ఆలోచిస్తున్నాడు. మనం ఆలోచించేటప్పుడు సాధారణంగా బుర్ర పైకెత్తి చూస్తూంటాం కదూ? అల్లాగే ఆతడు కూడా చెట్టుకేసి చూస్తూ ఆలోచిస్తూన్నాడట. ఇంతలో ఆ చెట్టునుంచి ఒక పెద్ద ముగ్గిన రేగుపండు నేలమీద పడింది. మనమైతే ఏం చేస్తామో! కాని న్యూటన్‌కు యింకో సందేహం వచ్చింది. ముగ్గిన పండు పైకిపోకుండ క్రిందికి ఎందుకు పడిందీ. అని! చాలా సేపు ఆలోచించాడు, ఆలోచించాడు. చివరికి భూమి ఆ పండుని తనవైపుకు లాక్కుందని

నిర్ణయించుకున్నాడు. దానికతడు ఎంత సంతోషించాడనుకున్నారు! చాలా సంతోషించాడు. ఎందుచేతంటే- అతడు అన్నాళ్లనుంచి ఆలోచిస్తూన్న ప్రశ్నకి జవాబు అందులోనే వుంది కనుక!

చెట్టు ఎక్కడ్నించి పుట్టింది? భూమిలోనుంచి పుట్టింది. అందుచేత చెట్టుకి అమ్మ భూమి. చెట్టుకి పిల్ల రేగుపండు. కాబట్టి భూమి రేగుపండుకి అమ్మమ్మ. అమ్మమ్మలకు మనుమరాళ్ళమీద ప్రేమ ఉండదా? ఎందుకుండదు? అంచేతనే భూమి తన మనుమరాల్ని దగ్గరకు లాక్కుంది.

అల్లాగ్గా మన సూర్యుడికి కూడా తల్లి ఉంది. సూర్యుడికి చాలామంది పిల్లలున్నారు. పాపం! సూర్యుడు తన పిల్లలదగ్గరికి వెళ్ళిపోదామని ప్రయత్నిస్తుంటాడుట. కాని అతని తల్లి 'నా దగ్గర్నించి వెళ్ళిపోక!' అని అంటుంది. పిల్లలు తమవైపుకీ, తల్లి తన వైపుకూ, ఇల్లా లాగుతుంటే, ఎవర్ని వదిలించుకోలేక సూర్యుడల్లాగే. ఆకాశంమీద తల్లికీ, పిల్లలకీ మధ్య తిరుగుతూ ఉంటాడుట.

ఇలాగ సూర్యుడికీ, భూమికీ మధ్య ఆకర్షణ శక్తి వుందని మొట్టమొదట తెల్సుకొన్న వారెవరో తెలుసా? న్యూటన్.

ఆలోచిస్తే మనం మాత్రం ఎన్ని కనిపెట్టలేము.!

-మార్చి, 1946.

---

## 15. పందికొక్కు

రచన : **న్యాయపతి బలరామదాసు**

"ఏదీ—ఈ కథ గబగబ చదవండి!"

గాదెలోను కందిపప్పు
గాదెక్రింద పందికొక్కు!
నక్కినక్కి బొక్కుచుండె
కందిపప్పు పందికొక్కు!
ముట్టెపెట్టి బొక్కుచుండ

చిట్టిపొట్టి అక్కవచ్చె!
నక్కినక్కి యున్నకొక్కు
అక్కరాక అంతజూచె.
కందిపప్పు పందికొక్కు
క్రిందవేసి పారిపోయె!

-సెప్టెంబరు, 1945.

# 16. బాల విజ్ఞాన కథలు

రచన :
**వేలూరి శివరామశాస్త్రి**

మూలం :
కానన్ స్క్మిడ్స్సన్

## చేపెట్టె

మల్లయ్య కార్ఖానాలో కుమారయ్య అనే పనివాడొకడు న్నాడు. తన కంటె గొప్పపనివాడీ భూలోకంలో మరిలేడని వానికి భలే గర్వం. కుమారయ్య గురువు దానయ్య అనేవాని పని చూచి మెచ్చుకుంటాడు. మల్లయ్య, మంగయ్య అనే వాని పనిమా బాగుంటుందంటాడు. కుమారయ్య ఇది చూచి లోలోపల సణుగు తుంటాడు.

ఒకనాడా వస్తువులన్నీ సంతకు తీసుకు పోయారు. అప్పుడు లోకులు తన వస్తువులకు విలువ ఎల్లా కడతారో చూదామని కుమా రయ్య కూడా సంతలోకి వెళ్లాడు.

పట్న వాసులందరూ అమరయ్య అనే వానిచేత మంచి వస్తువు లకు వెలకట్టించటం మామూలు. అమ్మేవాడూ కొనేవాడూకూడా అమరయ్య మాట పాటిస్తారు.

అంజయ్య అనే సంసారి అమరయ్యను వెంటబెట్టుకొని సంతకు వెళ్లాడు. దానయ్య చేసిన చేపెట్టె వానికంట బడ్డది. దానికి వెల కట్టమని అంజయ్య అమరయ్యకు చెప్పి, మల్లయ్యను గూడా దాని వెల చెప్పమన్నాడు. "అమరయ్య ఎల్లా చెబితే అల్లా ఇస్తా" నని మల్లయ్య అన్నాడు.

అమరయ్య పాతిక రూపాయలు వెల కట్టాడు.

అటు పిమ్మట అంజయ్య మంగయ్య చేసిన పెట్టెకు వెల కట్ట మన్నాడు. అమరయ్య దానికి పదిహేను వెల కటాడు.

పిమ్మట అంజయ్య కుమారయ్య పెట్టెకు కూడా వెలకట్టమని కోరాడు. "ఆ రెండు పెట్టెలమీదా అది కొనరు" అని అమరయ్య అన్నాడు. మల్లయ్య ఒప్పుకున్నాడు.

కుమారయ్య అదిచూచి విలువునా నీరయినాడు.

"గరువంబసూయయు గడుకొను నేని
తలవంపులొనరించుఁ దప్పకెందేని".

—మే, 1948.

## 17. అఖిల భారత బాలల దినం

రచన : కవుల ఆంజనేయశర్మ (అనకాపల్లి)

అదిగో అదిగో వచ్చింది !
ఆనందంగా వచ్చింది !
అఖిల భారత బాలల దినం
అదియే మనకొక పర్వదినం॥
నవంబరు పదునాల్గవ తేది
నెహ్రూ పుట్టిన రోజండీ !
భారతావనిలో బాలలందరు
బలేహుషారుగ జేస్తారు॥
బాలసంఘాల్లో చేరిన బాలలు
పాఠశాలలకు పోయెడి పిల్లలు
ఆనందంగా చేస్తారు...
ఆడుచు పాడుచు యుంటారు॥
నెహ్రూపటమును చేతిలోపట్టి
చాచా నెహ్రూకు జేజేలంటూ !
భారతరత్నకు జేజేలంటూ
జై జై ధ్వనులతో త్రిప్పెదరు...
పెద్దలందరిని పిలుచుకువచ్చి
పెద్దగ సభలు జరిపించి
పుట్టినరోజు ప్రాముఖ్యతను
ప్రజలకు బాగుగ చెప్పెదరు...
ఆ రోజుననే బాలలందరు
ఆట పాటలు, నృత్యనాటికలు
అన్నియు బాగుగ చేస్తారు !
ఆనందంగా ఉంటారు॥
దేశనాయకుడగు నెహ్రూబాబుని
దీక్షతో అందరు కొలిచెదరు
పల్లెపల్లెలా పుట్టినరోజు
బాగుగ అందరు చేసెదరు.

-నవంబరు, 1959.

# 18. టొమాటో

రచన : లవణం

మీకు సాధారణంగా పండ్లంటే చాలా ఇష్టం కాదూ ? నిజం చెప్పండి. ఎందుకో తెలుసా? అవి చాలా రుచిగా ఉంటాయని. అంతే కాదు; ఇంకా చాలా విశేషాలున్నాయి. చెపుతాను వినండి. పండ్లలో పిల్లలు తినటానికి టొమాటో చాలామంచిది. దానినే రామమునగ అనికూడా అంటారు.

టొమాటాలో "సి" విటమినుందని చెపుతారు. విటమినంటే తెలుసా? మనంతినే ఆహారంలో మనకి బలం, ఆరోగ్యం ఇచ్చేవి అన్న మాట. అందుకనే డాక్టర్లు ఎవరైనా జబ్బుపడితే పండ్లు, పాలు తీసుకోమంటారు. పండ్లు, పాలలో విటమిన్లు బాగా ఉన్నాయి. అందు చేత టొమాటోలో బలమైన ఆహారం చాలా ఉన్నది.

టొమాటాలు తింటే అందరూ మంచి ఆరోగ్యంగా ఉంటారు. ఇతర దేశాలలో టొమాటో తోటలు విస్తారంగా వేసి, వాళ్ళు తినగా మిగిలిన పళ్లను ముక్కలుకోసి డబ్బాలలో పెట్టి మనకు పంపుతారు. మనదేశంలో టొమాటోతోటలు చాలా తక్కువగా ఉన్నాయి.

ఇళ్లల్లో పండించుకోగల పంటలో టొమాటో ఒకటి. విత్తనాలు నాన్నలచేత తెప్పించుకుని ఇళ్లల్లో పండించి మనం తినవచ్చును. టొమేటో తిన్నవారు చాలా ఆరోగ్యంగాను, బలంగాను ఉంటారు. ఇతరదేశాలలో అందరూ పండ్లు ఎక్కువగా తింటారు. రాబోవు కాలంలో మనం పిల్లలమే రాజ్యాలు ఏలాలి. అందువలన ఇప్పటి నుంచి ఆరోగ్యంగాను, బలంగాను ఉండాలి. అందుకు పండ్లు తినాలి.

-డిశంబరు, 1946.

## 19. చిలకమ్మ పెండ్లి [గిడుగు వెంకటసీతాపతి]

చిలుకమ్మ పెండ్లియని
చెల్లికత్తె లందరును
చీర సింగారించి
చేరి కూర్చున్నారు....
పందిట పిచ్చుకలు-సందడిచేయగ
కాకుల మూకలు-బాకాలూదగ
కత్వాలు బెకబెక డప్పులుకొట్టగ
కుక్కు-రుకోయని కోడికూయగా।
జుమ్మని తుమ్మెద తంబురమీటగా
కుహూకుహూ కోయని కోయెల
పాడగా
పిల్లవాయువులు వేణు్రమోగగా
నెమిలి తీవితో నృత్యము చేయగ!

సాలీడిచ్చిన చాపు కట్టుకొని
పెండ్లికుమారుడు బింకముచూపగ
సీతకోకల చీరకట్టుకొని
పెండ్లికుమారిత ప్రేమచూపగా।
మల్లిక మాలతి మాధవీ లతలు
పెండ్లికుమారుని పెండ్లికూతురిని
దీవిస్తూ తమ పూవులు రాల్చగ
మైన గోరయొక మంత్రము
చదివెను
చిలుకమ్మ మొగుడపుడు
చిరునవ్వు నవ్వుతూ
చిలుక మెడలో గట్టె
చింతాకు పుస్తె.

మే 1946

---

## 20. అనువాదం

గుడిమెట్ల బంగారయ్య
Temple Steps Golden Father

పెద్దాడ కొండలరావు
Big Lady Mountains Dont Come,

బాడపల్లి ముత్యాలు
Boat Cat Pearls

ఏప్రియల్ 1957

## 21. నమ్మదగిన విన్నమాటలు

సంపాదన : జగదీశ్ బాబు (మద్రాసు)

1. ఎఱ్ఱరంగును చూస్తే ఈగలకు అమితభయం.
2. పసుపురంగు వెలుతురు కండ్లకు చెరుపు.
3. ఊరగాయలో రుచేగానిబలంలేదు.
4. పొట్టి కాళ్లుగలవారు చాలాకాలం బ్రతుకుతారు.
5. నాట్యం చేసేవారికి ఆయువు హెచ్చు.
6. చైనావారికి మెదడు పెద్దది.
7. మన అరచేతి పొడుగూ, ముఖం పొడుగూ ఒకటే.
8. ఆడపిల్లకు ఈత త్వరగావస్తుంది.
9. అమావాస్యముందు క్రాపు చేయించుకుంటే వెంట్రుకలు త్వరగా ఎదుగవు.

జూన్ 1946.

---

## 22. నీ కాళ్ళెందాకా ?

కూర్పు "అన్నయ్య"

నీకాళ్ళెందాకా-పోయాయీ ?
గోల్కొండదాకా-పోయాయి.
గోలకొండఏ-మిచ్చింది ?
గుడ్డిగవ్వనూ-ఇచ్చింది.
గుడ్డిగవ్వనేం-చేశావూ ?
గడ్డిమోపులో దాచాను.
గడ్డిపోచ ఏ-మిచ్చింది ?
ఎద్దుబండినీ-ఇచ్చింది.
ఎద్దుబండినేం-చేశావూ ?
బండివానికీ-ఇచ్చాను.
బండివాడు ఏ-మిచ్చాడు ?
పూలదండనూ-ఇచ్చాడూ.
పూలదండనేం-చేశావూ ?
పాలవెల్లికీ-కట్టేను.
పాలవెల్లి ఏ మిచ్చిందీ ?
బాలకృష్ణుని ఇచ్చిందీ.
బాలకృష్ణునేం చేశావూ ?
గొల్లభామకూ ఇచ్చాను.
గొల్లభామ ఏమిచ్చింది ?
వెన్నముద్దనూ ఇచ్చింది.
వెన్నముద్దనేం చేశావూ ?
చిన్న అత్తకూ ఇచ్చాను.
చిన్న అత్త ఏమిచ్చిందీ
చక్కనిబావను నిచ్చింది.

ఫిబ్రవరి 1948.

మన నగరములు

# 23. హైదరాబాదు

రచన : మల్లికార్జున సిద్ధాంతి

మీరు విన్నారో లేదో గాని మన దేశపు దక్షిణభాగంలో "గోల్కొండ" అనే గొప్ప పట్టణముండేది. ఆ పట్టణాన్ని ఏలేరాజు మహమ్మదీయుడు. ఆ రాజునే 'నవాబు' అనిపిల్చేవారు. ఆ ఊళ్ళో ఉండే కొండమీద మంచి మేడలు కట్టుకొని కాపురముండేవాడు నవాబు.

ఈ నవాబు దగ్గరమంచి అందగత్తె ఒకతె ఉండేది. పేరు "భాగ్యమతి". చక్కని పేరు కదూ? భాగ్యమతిమీద నవాబుకెంతో ప్రేమ. ఆమె ఏది కోరితే అదిచ్చేవాడు.

గోల్కొండ దగ్గర పారుతూండే "మూసీ" నది ఒడ్డున గొప్ప నగరాన్ని కట్టించాడీనవాబు. చాలారోజులు ఆలోచించాడు. ఏమని? ఆ కొత్త నగరానికి ఏపేరు పెడితే బాగుంటుందా? అని. ఆలోచించి ఆలోచించి, చివరకేంచేశాడనుకున్నావ్! అందరికంటే ఎక్కువ ప్రేమిస్తాడే ఆ అందగత్తె పేరే పెట్టాడు— "భాగ్యనగరము" అని.

నవాబు గారుండే గోల్కొండలో సరిగా మంచినీళ్ళు దొరికేవు కావు. అందుచేత ఆ ఊరును వదలి భాగ్యనగరాని కొచ్చాడు. కొన్నాళ్లకు భాగ్యమతి చనిపోయింది. తర్వాత ఆ నవాబే భాగ్యనగరానికి "హైదరాబాదు" అనే పేరు పెట్టాడు.

ఇప్పుడు కూడా హైదరాబాదులో నవాబున్నాడు. ఆయన్ని నవాబు అని పిలవరు. "నైజాం" అంటారు. ఆయన రాజ్యాన్నె "హైదరాబాదు సంస్థానం" అంటారు. మనదేశంలోని సంస్థానాలన్నిటిలోకి హైదరాబాదు సంస్థానమే పెద్దది. దీనికి ముఖ్యపట్టణంకూడా హైదరాబాదే!

నైజాంగారికి ఊళ్లో చాలా పెద్ద భవనముంది. దాని పేరు "ఫలక్‌నామా రాజ భవనం" బలేఅందంగా ఉంటుంది. ఈ ఊరిమధ్యలో చాలాఎత్తైన స్తంభాలు నాలుగున్నాయి. వాటికే చార్‌మీనార్ అనిపేరు. ఇవి కట్టి ఎన్నో సంవత్సరాలైనాయి. హైదరాబాదులో ఎక్కడికెళ్లినాసరే ఈ స్తంభాలు కనిపిస్తుంటాయి.

హైదరాబాదులో కూడా "జూ" ఉంది. అక్కడ మంచి మంచి రంగుల పక్షులున్నాయి. వాటిలో వింతైనవి; తెల్లని రామ చిలుకలు, తెల్లని నెమళ్లు. నువ్వెప్పుడైనా అట్లాంటివి చూశావా? ఇక్కడే పెద్దతోటకూడా ఉంది. ఎప్పుడైనా నైజాంగారి రాణులు ఇక్కడికి షికారుగా వస్తారు.

హైదరాబాదులో మరో వింతకూడా ఉంది. అక్కడి రూపా యలు, మన రూపాయల్లాగా వుండవు. వాటిమీద ఉర్దూ అక్షరాలు, చార్‌మీనార్ బొమ్మలూ ఉంటాయి. ఆ రూపాయలు మన ఊరికి తెచ్చామా ఎందుకూ పనికిరావు. అయితే మనరూపాయలు అక్కడ బాగా పనికివస్తాయి. ఆ రూపాయలు, అణాలు చేసేదికూడా హైదరాబాదులోనే! దాన్నే "టంకశాల" అంటారు.

మన ఉత్తరాలమీద, బిళ్లలమీద జార్జిరాజు బొమ్మ ఉంటుంది. హైదరాబాదులో వుత్తరాలమీద, బిళ్లలమీద ఉర్దూ అక్షరా లుంటాయి.

మన ప్రపంచంలో ఎన్నో దేశాలున్నాయి. అన్ని దేశాల్లోనూ, బాగా డబ్బుండేవాళ్లున్నారు. కాని వీళ్లందరికంటే-అనగా ప్రపం చంలో అందరికంటే ఎక్కువడబ్బు కలవాడు మనదేశంలోనే ఉన్నాడు. మరెక్కడో కాదు - ఈ హైదరాబాదునగరంలోనే! అతడే నైజాం!

-ఫిబ్రవరి, 1947.

# 24. గొబ్బి జాతక కథలు

## అమాయకపు గొబ్బి

రచన : - శిష్ట్లా ఉమామహేశ్వరరావ్

పండుటాకుల పల్నాటి అడవిలో నాగు లేరు తీరాన ఆవులను కాచుకుంటూ ఆలకిస్తున్నది గొబ్బి.

గొబ్బి స్నేహితురాలు మంగళ కూడా గోవులను కాస్తూన్నది. గొబ్బి యేమి చెప్పితే అది అర్థమైనా, కాకపోయినా వినడం మంగళ కలవాటు.

"మందలలో ఉండేవాటికి మందమతులుంటాయే మంగళా!" అన్నది. "మందమతి అనే మాట అందుకే పుట్టింది," అని సమర్థించుకుంది గొబ్బి.

మళ్ళీ అన్నది గొబ్బి: "చూడు! బాతులను కనిపెట్టు. ఎంత బుద్ధిహీనమైనవో! కాస్త ఎగరగలవు-బాగా ఎగరలేవు. కాస్త యీదగలవు-బాగా ఈదలేవు. నీళ్లల్లోనూ సరిగా ఉండలేవు. భూమిమీదా సరిగా ఉండలేవు".

''చిన్నదానివైనా నీ మాటల్లో మహాత్మ్యం ఉందే గొబ్బీ!" అనేది మంగళ.

భావాల్లోనూ, కలల్లోనూ స్వేచ్ఛగా తిరిగేది గొబ్బి. దాని చిన్న యాత్మ భావప్రపంచంలో ఉయ్యాలలూగేది. తమ గాన మహాత్మ్యం తమకు తెలియకుండానే పొద్దస్తమానం హాయిగా ఎట్లా కోకిలలు పాడుకుంటాయో అట్లాగే గొబ్బి భావతరంగాలు ప్రపంచాన్ని దాటిపోతూండేవి.

"విను, ఆ మైనా ఎట్లా కూస్తున్నదో! మైనాల మోహం చిట్టడవుల చిగుర్లల్లో గాని తెలియదు. కాసేపు ఓ చెట్టుమీద, కాసేపు ఓ కొమ్మమీద, కాసేపు ఎగరడం, కాసేపు తిరగడం-ఏమి దాని పరవశం! మనుష్యునికన్నా ఎంత బలమైన కూతో దానిది విను. మనుష్యుని పిడికిలలోకి గూడా సరిగా రాదు. విను విను. మనతో

మాట్లాడుతుందేమో। మారురూపంలో ఉన్న ఎవరైనా రాజకుమారుడేమో!

"పైనచూడు; ఆ యెగిరిపోయే పిట్టలను చూడు. అవి గుంపులుగా ఎట్లా ఎగురుతుంటాయో! ఒక్కటిగూడా తప్పించుకోదు గదా! ఏమి వాటి స్వేచ్ఛ! ఎంత పైకి ఎగిరిపోతాయి! ఆ డేగ చూడు ఎంతెత్తు ఎగురుతుందో! మనకీగూడా ఎగిరిపోయే శక్తి ఉంటే బాగుండునే మంగళా!" అని అంటూనే తన మాటల దూకుడుకు తానే తూలిపోయేది గొబ్బి.

ఒకసారి మంగళ ఒంటరిగా అడవికి పోయి పుల్లల మోపెత్తుకుని ఆవులను తోలుకుంటూ ఇంటి కొచ్చేటప్పటికి ఆలోచిస్తూ ఆలోచిస్తూ అరుగుమీద కూర్చున్న గొబ్బి "మంగళా ఇటు చూడు! వాయువు ఎందుకు వీస్తుందో తెలుసా?" అన్నది

"నాకు తెలియదు గొబ్బీ! నీకు తెలుసా?"

"అవును నాకు తెలుసు. ఈ ప్రపంచం చూస్తున్నాగదా పుట్టిన ప్రతిదీ పెరగాలి. పెరుగుతున్న ప్రతిదీ తిరగాలి. పిట్టలు ఎగురుతాయి, పురుగులు పాకుతాయి. పశువులు పరుగెత్తుతాయి. కప్పలు గెంతుతాయి. ఒక్క చెట్లూ, చామలూ మాత్రమే జరగవు. అవి కూడా పెరుగుతాయి గనక అటూ ఇటూ కదులుతాయి. వాటిని కదిలించడానికే వాయువు వీస్తుంది. వాటంతటవి చేసుకోలేని పని వాయువు చేస్తుంది. వాటిని గలగల లాడిస్తుంది. వాటికి వాయువే ఆధారం. వాయువుకవన్నీ పెంపుడు పిల్లలు."

"నువ్వసలు దేవతవే గొబ్బీ! నీ దగ్గిర దేవతామహాత్యం ఉందే! అయితే ఒక్క రహస్యం చెప్పు; పాటపాడే పిట్టలు పొద్దస్తమానం పాడుతై గదా! వాటి ఆలోచనలేమిటో? ఏమనుకుంటాయో?"

"చూడు మంగళా! ఏ పిట్ట గూడా తనదగ్గిరించుకుందామని ఏ యోచనా పెట్టుకోవు. మనుష్యుని మనస్సట్లా గాదు. ఎప్పుడూ ఏదో అనుకుంటూనే ఉంటుంది. మనలో కొన్ని యోచనలు మాట్లాడుతాయి, కొన్ని పాడుతాయి, కొన్ని దుఃఖిస్తాయి. ఒకొక్కప్పుడు మనకు మనకే తెలియదు. పిట్ట అట్లా గాదు. పాడినంత

సేపు పాడుతోంది. పాట ఆపితే పవ్వళిస్తుంది. లేకపోతే మేత తింటుంది."

"సరేలేవే గొబ్బి! ఇంట్లోకి పోయొస్తా. గొడ్లకు నీళ్లు పెట్టాలి."

అట్లాగే ఆ అరుగుమీద ఆలోచిస్తూ కూర్చున్నది గొబ్బి. దాని సుందర వదనంమీద అమాయకం, ఆనందం అల్లుకుపోయి న్నాయి. వాయువు వీస్తూ చెట్ల నీడలను చెదిరిస్తుంటే చూస్తూ కూర్చుంది. ఆకాశంమీద అట్లాగే నిలిచి ఉండేవి మేఘాలు. ఒక్కొక్కసారి గిర్రు గిర్రుమని తిరుగుతూ ఒకదానొ్నకటి వేటాడేవి. ఈ విశాల ప్రపంచంమీద మేఘాలెట్లా పుట్టుతాయో, పెరుగుతాయో, చివరకు కరుగుతాయో అట్లాగే గొబ్బి హృదయంలో మేఘాలచిత్రాలు పుట్టేవి, పెరిగేవి, కరిగిపోయేవి.

-డిసెంబరు, 1947.

---

## 25. అంకెల తమాషాలు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |
| | 9 | 8 | 7 | 6 | 5 | 4 | 3 | 2 | 1 |
| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |
| | 9 | 8 | 7 | 6 | 5 | 4 | 3 | 2 | 1 |
| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |
| | 9 | 8 | 7 | 6 | 5 | 4 | 3 | 2 | 1 |
| | | | | | | | | | 3 |
| 3 | 3 | 3 | 3 | 3 | 3 | 3 | 3 | 3 | 3 |

-పంపినవారు: కురుమద్దాలి రామచంద్రమూర్తి శర్మ,
బెజవాడ

-మార్చి, 1946.

## 26. మాటలు నేర్చుకో!

రచన : ఎస్. రత్నాకర్ (సిద్ధిపేట)

1. — రము = మొసలి
2. — రము = తుమ్మెద
3. — రము = పట్టణము
4. — రము = యుద్ధము
5. — రము = చీకటి
6. — రము = ఆలస్యము
7. — రము = తపి
8. — రము = కడుపు
9. — రము = నెమిలి
10. — రము = యెందర
11. — రము = చెట్టుతొఱ్ఱ
12. — రము = డేరా
13. — రము = మంచు
14. — రము = చెఱువు
15. — రము = లేఖ
16. — రము = సమూహము
17. — రము = భయంకారము.

(జవాబులు 42 వ పేజీలో చూడుడు)




రచన : పక్కి హరనాథ్ పట్నాయక్ (వాల్తేరు)

లటుకు ఒక డాక్టరుగారిని సంపాదించాడు. గురువుగారు లటుకును ఒక రోగివద్దకు తనతో తీసుకొని వెళ్ళాడు. డాక్టరు రోగిని చూచి, "నీవు ఈ రోజున కమలాపళ్లు తిన్నావుకదూ?" అని అడిగాడు. రోగి నిజమే అని జవాబిచ్చాడు. ఇంటికిరాగానే, లటుకు, "ఆ రోగి కమలాపళ్లు తిన్నాడని ఎలాగ చెప్పారు ?" అని డాక్టరు గారిని ప్రశ్నించాడు. "రోగి మంచముక్రింద కమలాపళ్లతొక్కలు కనబడుటచే పోల్చి చెప్పాను" అని డాక్టరు చెప్పాడు.

ఆ మర్నాడు లటుకు ఒక్కడే ఆ రోగిని చూడటానికి వెళ్ళాడు. రోగి మంచంకింద చెప్పులు కనిపించాయి. "నీవు ఈ పూట చెప్పులు తిన్నావు కాదయ్యా!" అని ప్రశ్నించాడు.

రోగికి కోపంవచ్చి, ప్రక్కనున్న కర్రతో లటుకుకి నాలుగు అంటించాడు. అక్కడితో లటుకు వైద్యం కుదిరిపోయింది.

చిటుకు ఒక ఆస్పత్రికి వెళ్ళాడు. ఆపరేషన్ గదిలో ఒకనికి కాలు ఆపరేషన్ చేస్తున్నారు. చిటుకు అది చూశాడు. "ఓహో! ఆస్పత్రిఅంటే కోతలటయ్యా!" అంటూ తిన్నగా ఇంటికి వచ్చేశాడు.

లటుకు చిటుకులవైద్యం అంతటితో సరి. -ఫిబ్రవరి, 1949.

## 27. "త" గుణితము

| | | |
|---|---|---|
| తల్లి దండ్రులమాట | - | తలదాల్పవలయు |
| తాత సేవలు నీవు | - | తగ జేయుమయ్యా |
| తిమ్మ చేష్టలు చేసి | - | తిట్లు కాయకుము |
| తీపి వెన్నడు బాగ | - | తినబోకుమయ్యా |
| తుంటరి పిల్లలతో | - | తంటాలు పడకు |
| తూనగ వెన్నడు | - | తును మాడకయ్యా |
| తెల్లవారగ లేచి | - | కల్లలాడకుము |
| తేమ నేలలపైని | - | తిరుగంగ బోము |
| తొలుత దేవుని పూజ | - | సలువు మోయున్న |
| తోటివారికి బాగ | - | తోడుపడమన్న |
| తేడు కూడని కూడు | - | చెడుగు కేయన్న |
| తొందరపాటునూ | - | పొందబోకన్నా |
| తృణముగా నామాట | - | గణన సేయకుము |

పి. విద్యావతి, 5-వ క్లాసు.
విజయనగరం.
ఫిబ్రవరి 1946.

---

| | | | |
|---|---|---|---|
| 1. | మకరము | 2. | భ్రమరము |
| 3. | నగరము | 4. | సమరము |
| 5. | తిమిరము | 6. | జాగిరము |
| 7. | మధురము | 8. | ఉదరము |
| 9. | మయూరము | 10. | వేగిరము |
| 11. | కోటరము | 12. | గుడారము |
| 13. | తుషారము | 14. | సాగరము |
| 15. | ఉత్తరము | 16. | నికరము |
| 17. | భీకరము. | | |

## 29. చుట్టం

నార్ల వెంకటేశ్వరరావు

ఇంటికి చుట్టం వచ్చాడు. తండ్రి, కొడుకుని పిలిచి గొప్పగా--

తండ్రి : ఏమిరా బాబూ! మనింటికి వచ్చిన ఆయన ఎవరురా?

కొడుకు : చుట్టం.

తండ్రి : అంటే?

కొడుకు : చుట్టం అంటే మనింట్లో అప్పచ్చులు, పప్పులు చేస్తే తినడానికి వస్తాడు. వాడు కదూ?

సెప్టెంబరు 1945

....—

## 30. అ ఆ ఇ ఈ లు

రచన : బొల్లాప్రగడ వీరవెంకట సుబ్బారావు

అన్నా అన్నా రావోయీ
ఆలస్యము యింకేలోయీ
ఇద్దరమును మరిజట్టగను
ఈశ్వరాలయము కేగుదము
ఉత్సవములనూ చూదాము
ఊరేగింపుతో వెడదాము
ఋషివలె దండము పెడదాము
ఎప్పుడు రక్షించుము అనుచు
ఏకష్టము కలిగించకను
ఐశ్వర్యంబుల యిమ్మనుచు
ఒప్పుగ మనము యిద్దరము
ఓప్రార్థన చేసుకు వద్దాము

ఫిబ్రవరి 1946

# 31. హిమాలయాలు

అడపా రామకృష్ణరావు

కాళిదాసు అనే కవి "కుమార సంభవం" అని ఒక పుస్తకం రాశాడు. అందులో హిమాలయాలను గురించి చాలా కథ వుంది. ఏమిటంటే ఆ కథ—ఈ హిమాలయ పర్వతాలకు హిమవంతుడు అని ఒక రాజున్నాడట. ఆయనకు మేనకాదేవి అనే భార్యా, పార్వతి అనే కూతురూ ఉన్నారు. పార్వతిని పరమశివునకిచ్చి పెళ్ళి చేస్తే బాగుంటుందని నారదుడు హిమవంతుడితో చెబుతాడు.

ఆ సమయంలో శివుడేమో గాఢమైన తపస్సులో ఉన్నాడు. అప్పుడు పార్వతీదేవి ఏం చేసింది? ఆయనని మాట్లాడించకుండానే పూజకు కావలసిన పువ్వులూ, పళ్లూ, గంగాజలమూ అన్నీ అమర్చి పెడుతూ శివునికి సేవ చేసింది. కాని కొంత కథ నడిచాక శివుడు ఒక రోజున పార్వతితో చెప్పకుండా ఎక్కడికో వెళ్ళిపోయాడు. అప్పుడు పార్వతీదేవి అలిగి, వాళ్లమ్మ మేనకాదేవి ఎంత వొద్దంటున్నా వినక అడవిలోకి వెళ్ళి గాఢమైన తపస్సు చేసింది. శివుని మనసు కరిగి పోయింది. సరే - పెళ్ళి చేసుకుంటానన్నాడు. అప్పుడు శుభ ముహూర్తం చూసి, ఆకాశమంత పందిరి వేసి, భూదేవి అంత అరుగులు చేసి, గుచ్చిన ముత్యాల తోరణాలు కట్టి, గుచ్చని ముత్యాలు తలంబ్రాలు పోసి, ఋషులూ, దేవతలూ అందరూ పెళ్ళిపెద్దలై పార్వతీ పరమేశ్వరుల కల్యాణం చేశారు. ఇదో కథ.

ఇంకో కథ "మనుచరిత్ర" నించి చెబుతాను. అరుణాస్పద మనే ఒక ఊళ్లో ప్రవరుడు అని ఒకాయన ఉన్నాడు. ఆయనకు మనమాదిరే మన దేశంలో ఎక్కడెక్కడ ఏమేమి ఇంపుసొంపు లున్నాయో, అన్నీ ఒకమాటు చూసిరావాలని కోరిక. ఇట్లా ఉండగా వాళ్ళ యింటికో రోజున ఒక యోగి వచ్చాడు. ఆయన తనదగ్గిర ఒక పసరుందనీ, అది కాలికి రాచుకుని ఎక్కడికి వెళ్ళాలనుకుంటే అక్కడికి వెళ్ళవచ్చనీ చెప్పాడు. ఇంక చెప్పేదేముంది? మన ప్రవరుడు గబగబా కొంచెం పసరు అడిగి పుచ్చుకొని కాళ్ళకు పూసుకొని "హిమాలయ పర్వతాలకు వెళ్ళాలి" అని కళ్లు మూసుకున్నాడు. కళ్లు తెరిచేటప్పటికి హిమాలయాల దగ్గఱకు వచ్చి

వాలాడు. అటూ ఇటూ తిరిగి చూచాడు. "ఈ పువ్వులూ, దేవదారు వనాలూ, కమ్మని కస్తూరి సువాసనా, గంగానది చల్లటి కెరటాలూ - ఓహో! ఎంత బాగుంది!" అనుకున్నాడు. సరే - వేళయింది. కళ్లు మూసుకొని "మా ఊరు అరుణాస్పదం వెళ్ళాలి" అన్నాడు. ఉహుఁ- అరుణాస్పదమూ లేదు. ఏ పదమూ లేదు. ఎక్కడున్నవాడు అక్కడే వున్నాడు. "ఇదేమిటా" అని కాళ్ళవంక చూసుకున్నాడుగదా-ఏముంది? మంచుమీద నడవడంచేత పసరంతా కరిగిపోయింది. "వచ్చిన దారి తెలియదయ్యే - ఇంక ఏందారి? ఇంటికెట్లా పోను?" అని దిగులుబడి "ఛీ-రాకరాక ఈ పాడు పర్వతాలకెందుకు వచ్చాను. చూడాలంటే కాశీ లేదా? గయా, ప్రయాగ లేవా? ఇక్కడన్నీ రాళ్ళూ, రప్పలూ, పులులూ, సింహాలూ, అడవులూ, మంచూ - ఈ దిక్కుమాలిన మంచుకొండలకే రావాలా? నా తెలివి మండిపోనూ!" అని కాస్సేపు పొగిడిన నోటితోనే పర్వతాలను తిట్టి, కాస్సేపు తననే తిట్టుకొని అటూ ఇటూ తిరుగుతూ వుండగా ఎక్కడినించో చక్కటి హాయిగొలిపే సంగీతం వినిపించింది.

ప్రవరుడు గబాగబా అటువేపు పరిగెట్టికెళ్ళి చూడగా అక్కడొక పూల పొదరింటి దగ్గఱ ఒక అమ్మాయి కూర్చొని వీణ వాయిస్తూ పాడుకుంటున్నది. ఆమె దగ్గఱికి వెళ్ళి "నేను మా ఊరి దారి మరిచిపోయాను, కాస్త చెప్పవా?" అని బ్రతిమాలాడు. ఆమెపేరు వరూధిని. వరూధిని నవ్వి, "ఏమిటి-మావూరు, మావూరు అని ఒకటే పలవరిస్తున్నావు, ఇక్కడ ఎంచక్కా గంగానది ఒడ్డున ఇసుక తిన్నెలున్నై. అలిబిల్లిగా అల్లుకున్న పొదరిళ్లున్నై, రత్నాలున్నై, కమ్మని కస్తూరి పరిమళం ఉంది. ఇన్నిటినీ విడిచిపెట్టి మీ ఊరు వెడతానంటావెందుకు? ఇక్కడే ఉండిపో, హాయిగా ఉంటుంది." అని చెప్పింది. కాని ప్రవరుడు మాత్రం ఎట్లాగైనా ఇంటికి వెళ్ళి తీరాలని అగ్నిదేవుణ్ణి ప్రార్థించి వాళ్ళ వూరు చేరుకున్నాడు. ఇది మరో కథ.

-నవంబరు. 1945.

## 32. పుట్టినరోజు

రచన:
సాంబశివరావ్ బాబ్జీ

పుట్టినరోజూ పండుగనాడూ
చుట్టాలొచ్చారు.
కాజాలడ్డూ తాజా గారెలు
తెచ్చి పెట్టారు.
ఇరుగూపొరుగూ పిల్లా పెద్దా
యింటికి వచ్చారు.
చిందులుతొక్కే చిట్టిబాలకి
జేజే లన్నారు!

అమ్మాలక్కాలంతా కలసీ
హారతులిచ్చారు
బాలబాలికలంతాకూడి
బంతూలాడారు
పాలూ పళ్లూ పాయసమంతా
పంచీ పెట్టారు;
ముచ్చటగొలిపే ముద్దులబాలకి
జేజే లన్నారు!!

ఆగష్టు-1947

---

## 33. జ్ఞాపకశక్తి

శ్రీను: ఏమండీ! మనం 1940 లో రాజమండ్రీలో కలిశాంకదూ?

వేణు: నేను ఎప్పుడూ రాజమహేంద్రవరం వెళ్ళలేదే!

శ్రీను: ఓ అయితే మనం 1942 జనవరి 26 వ తేదీన బెజవాడలో రిపబ్లిక్ దినోత్సవంనాడు కలిశాము.

వేణు: లేదండీ! నేను ఎప్పుడూ ఎక్కడా రిపబ్లిక్ ఉత్సవానికి వెళ్లలేదే!

శ్రీను: సరిసరి జ్ఞాపకం వచ్చింది మనం కర్నూలులో గత నవంబరులో కలిశాం. మీ పేరు గోపీకదూ?

వేణు: నీ మొహం! నేను కర్నూలు ఎప్పుడూ వెళ్ళనిదే! నీకు ఆమాత్రం నా సంగతి తెలియదూ? నా పేరుకూడా మరచిపోయావా? నీ తమ్ముడు వేణుని.

ఆగష్టు-1956

## 34. పొడుపు కథలు

1. వైరులేని పంట
పువ్వులేని కాయ

2. తలాకాళ్ళూ లేని
మొగవాడు దేశమంతా
తాను తిరుగుతాడు

3. నాకుఅమ్మ
నీకు అమ్మ
అందరికీ అమ్మ

4. జేబులో తానుండి
ఇంకోరిని ఉండనీయదు

5. మంచంక్రింద మామయ్య
సంతకి వెడదాం రావయ్య

| |
|---|
| 1. ఉప్పు |
| 2. చొక్కా |
| 3. తులసిమ్మ |
| 4. చినుగు |
| 5. చెప్పు |

జనవరి 1951

---

## 35. వారాల కథ

రచన : అబ్బాయి

ఆదివారమునాడు-అబ్బాయిపుట్టె
సోమవారమునాడు-చొక్కాలు
తొడిగె.
మంగళవారంనాడు - మాటలూ
చెప్పె.
బుధవారమునాడు - పుస్తకము
చదివె.
లక్ష్మివారమునాడు -
లడ్డూలు తినియె.
శుక్రవారమునాడు -
షోకులనుచేసే
శనివారమునాడుసభలోకివెళ్లే
ఇన్ని వారాలలో-ఇన్ని చేశాడు
ఎవ్వరీ అబ్బాయి-ఎవ్వరీపాప ?

ఆగష్టు 1946.

## 36. నా ఆలోచనలు

రచన : కుందు

మా యింట్లో నాకు ఊసు పోకపోతే కిటికీదగ్గర కూచొని ఆలోచిస్తూ వుంటాను. అప్పుడు ఇటువంటి ఊహాలు కలుగుతూ ఉంటాయి...

1. గ్రామఫోను పెట్టె విరగగొట్టితే, అందులో నుంచి పాట పాడేవారు బయటికి వస్తారేమో !

2. రేడియో పెట్టె తెరిచిచూస్తే అందులో రేడియో అన్నయ్య. రేడియో అక్కయ్య కనిపిస్తారేమో !

3. డాక్టరుగారింట్లో ఎవరికీ జబ్బులు చేయవేమో !

4. చెయిర్ మన్ అంటే మీటింగులలో కుర్చీలు తెచ్చి వేసే వాడేమో ,

5. సినీమా చూస్తున్నప్పుడు తెరవెనుక యాక్టు చేసే వాళ్లుంటారేమో !

6. రేషనింగ్ ఆఫీసులోవాళ్ళకి తిండికి కరువుండదేమో !

7. పోస్టుమాష్టరు యింట్లోవాళ్లు ఉత్తరాలకి బిళ్ళలు అంటించక్కర్లేదేమో!

— ఫిబ్రవరి 1952

---

## 37. పొట్టిబావ - పండుగ పచ్చడి

చిట్టి మరదల చిట్టి మరదల ఎక్కడికి కెళతావు?
గున్న అంటుమావులున్న తోటకెళతాను.
చిట్టి మరదల చిట్టి మరదల ఏమి తెస్తావు?
మంచి మంచి మామిడికాయలు ఏరి తెస్తాను.
చిట్టి మరదల చిట్టి మరదల ఏమి చేస్తావు?
వస్తూ ఉన్న ఉగాదికి పచ్చడి తెస్తాను...

— మార్చి 1947

# నందిని



## మీ ఆత్మీయులతో ఆనందం పంచుకోండి
## ఒక్క రూపాయికే నందిని నందుకోండి

కేవలం ఒక్క రూపాయితో – భారత దేశంలో మీ ఆత్మీయులు ఎక్కడున్నాసరే – సంవత్సరం పాటు వాళ్ళు మిమ్మల్ని గుర్తుంచుకునేలా – మీ ఆత్మీయతకు కొత్త అనుబంధాన్ని పెనవేస్తూ – యువభారతిని వారికి పరిచయం చేసినందుకు మిమ్మల్ని అభినందించేలా చేస్తూ – పన్నెండు నెలలూ మీ ఆత్మీయుల్ని పలకరిస్తుంది 'నందిని' అటు అందుకున్నవారికి ఆనందాన్నీ, ఇటు అందిస్తున్న మీకు సంతృప్తినీ సమానంగా పంచిపెడ్తుంది – 'నందిని'

**మీరు ఎన్నైనా రూపాయలు పంపవచ్చు**
**అన్ని చిరునామాలూ పంపాలని గుర్తుంచుకోండి!**